

జనవరి 12, వివేకానంద జయన్తి



# 'విశ్వహిందు'

(ధార్మిక, సామాజిక మాసపత్రిక)


| సంపుటి : 11 | సంచిక : 1 | ధాత - పుష్యం | జనవరి -1997 |
| --- | --- | --- | --- |



ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**బంగిళ సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి.యస్.నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**


చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా - రూ. 50.00

విడిప్రతి - రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.


చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ - 500 095.

ఫోన్: 517799, 591322.


ఈ సంచికలో .................. పుట


సంపాదకీయం ........................ 2

జైహింద్ తత్త్వవేత్త ........................ 4

భాగవతం - శ్రీ కృష్ణతత్త్వము ........... 6

ఉద్యమంతోనే పనులు .................7

శ్రీ పాదవల్లభులు ........................8

సంబరాల సంక్రాంతి ........................11

హిందూయువతులారా - ఉచ్చుల్లో పడవద్దు 13

కపోతేశ్వర క్షేత్రము ........................16

కృష్ణ జన్మస్థాన విముక్తి ........................17

ఆదినుండి ఆధునికంవరకు స్త్రీ ........... 19

ఆంధ్రకేసరి ........................21

యువతాసమ్మేళనం ........................22

వనవాసి కార్యకర్త ........................ 23

దుర్గావాహినీ శిక్షక శిబిరం ............ 24

జమ్మూ-కాశ్మీర్ పోకడలు ............... 25

విశ్వ కల్యాణం ........................ 26

యుక్త జీవనమే ముక్తి ........................27

ప్రాణి మిత్రుడవై ........................ 29

అంతర్ జాతీయ హిందుత్వం ............ 30

గ్రంథ పరిచయం ........................31

వార్తలు ........................32


ముఖ చిత్రం : సంక్రాంతి సంబరం

సంపాదకీయం

# పాలకులు - పక్షపాతం

మనల్ని పరిపాలిస్తున్న వారికి ఈజాతి అభివృద్ధిలో కాని, ప్రగతిలోకాని ఏ విధమైన శ్రద్ధ, ఆదర్శాలు లేవు.

"Is India going Islamic" అన్న పుస్తకాన్ని శ్రీ. జగజాత్‌రాయ్‌గారు వ్రాశారు. ఇందులో మనల్ని పరిపాలిస్తున్న వారు మనజాతి, చరిత్ర తెలిసి కూడా మనజాతిని ఇస్లామీకరణ చేయడానికి ఏవిధంగా తోడ్పడుతున్నారు, అనే దీన్ని గురించి చక్కని వివరాలు వ్రాశారు.

800 AD నుంచి మనపై నేటి వరకు మనజాతి, మనసంస్కృతులపైన ఇస్లామిక్ దాడి జరుగుతూవుంది. ఇస్లాం విస్తరణకు వారు మూడు విధాలుగా ప్రయత్నాలు చేస్తున్నారు.

1. బహుభార్యా పద్ధతి ద్వారా పరిమితి లేని సంతానాన్ని కనడం.

2. బలవంతంగా, హింసాత్మకంగా మతమార్పిడి చేయడం.

3. బలవంతంగా, దౌర్జన్యంతో, మాయమాటల ద్వారా భారత్ భూభాగాన్ని ఆక్రమించడం.

ఇస్లాం వ్యాప్తి కొరకై యూరప్‌పై దాడి చేసినపుడు యురోపియన్లు అందరూ ఒక సైన్యంగా ఏర్పడి ఫ్రాన్స్ వద్దనే వారిని ఎదుర్కొని ఇస్లాం సైనికులనుతోకముడిచిన కుక్కలా వెనుతిరిగి పంపారు. ఈ యుద్ధం 8సం॥ సాగింది. ఈ విధంగా యూరప్‌లో ఇస్లామీకరణ అసాధ్యమైంది. కానీ మన భారత దేశంలోని కొన్ని లోపాల వలన వారి పన్నాగాలు కొంత వరకు కొనసాగుతూ వచ్చాయి. ఇది మన చరిత్రలో జరిగింది.. కానీ సెక్యులరిజం పేరుతో మన రాజకీయ నాయకులు నేడు కూడా వారి రాజకీయ స్వార్థం కోసం ఇస్లామీకరణకు తోడ్పడుతున్నారు.

అమెరికాలో జులై నెలలో "హిందూ జాగరణ – దాని పరిణామాలు" అన్న విషయం మీద ఒక సమావేశంలో విశ్వవిఖ్యాతి గాంచిన వక్తలు ఉపన్యసించారు. ఈ వేదికనుంచి మాట్లాడిని వారందరు "భారత దేశంలో హిందూ జాగరణ అనేదేలేనప్పుడు దాని పరిణామాలు ఎలా వస్తాయని" వక్కాణించి చెప్పారు.

ఇది అంతర్జాతీయస్థాయిలో జరిగిన ఒక కుట్ర. ఈ కుట్ర ద్వారా హిందువులను నిరాశపరులుగా తయారు చేయడం కాక ఇస్లాం వ్యాప్తికి తోడ్పడ్డారు అనే విషయం బాగా స్పష్టమౌతుంది.

కార్మిక రంగంలో ముస్లిం కార్మికుల సంఖ్య కొద్దిగా పెరగగానే శుక్రవారం సెలవుగా ప్రకటించమని కోరడం, క్యాంటీన్‌లో హలాల్ చేయబడిన మాంసం ఏర్పాటుచేయాలని డిమాండ్ చేస్తారు.

ముస్లిం సంఖ్య ఎక్కడైనా ఒక మోస్తరులో పెరిగితే "మదర్సా" పాఠశాలలు వెంటనే ప్రారంభిస్తారు. పసి పిల్లలనుంచి పెద్దలవరకు అందరినీ ఫండమెంటలిస్ట్‌లుగా మార్చుతారు.

ముస్లిం మహిళలు కూడా బురఖా పద్ధతిని స్వేచ్ఛగా ఒప్పుకొంటున్నారు.

ఇటీవలనే ఇంగ్లాండ్‌లో ఒక సమావేశం ఏర్పాటు చేసి ఇంగ్లాండులోని ముస్లింలందరూ తాము బ్రిటీష్ ముస్లింలుకామని, తాము అసలైన ముస్లింలమనీ ప్రకటించారు. వారి ప్రకటనను చూసి బ్రిటీష్ ప్రభుత్వం దద్దరిల్లింది.

ఈ విధంగా అంతర్జాతీయస్థాయిలో ఇస్లాం వేగంగా వ్యాపిస్తున్నది. కానీ యూరప్‌లోని వారు ఇస్లామీకరణను అడ్డుకొని వారి పనులు సాగకుండా అడ్డుపడుతున్నారు. కానీ మన భారత్‌లో మన ప్రభుత్వం ఈ ఇస్లాం వ్యాప్తిని నిరోధించడానికి ఎటువంటి ప్రయత్నం చేయడంలేదు. కాబట్టి మనం మనదేశాన్ని మన సంస్కృతిని కాపాడడానికి ప్రతి హిందూపౌరుడూ స్వార్థం వదలి, సంఘటితంగా ఇస్లామిక్ శక్తులను ఎదుర్కోవాలి.

ఈ విధంగా మన ప్రభుత్వం కానీ, మన రాజకీయ నాయకులుకానీ ఇస్లామీకరణకు తోడ్పడం అనేది, ధర్మద్రోహం, జాతి ద్రోహం, సమాజద్రోహం. ఇది జరగకుండా మనం ఎదుర్కోవాలి.

800 AD నుంచి 700 AD వరకు ముస్లింలే మనల్ని పరిపాలించారు. ఈ సమయంలో ఛత్రపతి శివాజీ ఉత్తుంగ తరంగంలా లేచి, ఇస్లామీకరణ ఎదుర్కొన్నారు. శివాజీ మహరాజు తప్ప మరెవరూ హిందూ జాగరణకు తోడ్పడలేదు.

1700 నుండి 1947 వరకు బ్రిటీష్ వారు పరిపాలించారు. ఇటువంటి సమయంలో కూడా హిందూజాగరణ జరిగిన సందర్భాలు తక్కువే.

1925లో రాష్ట్రీయ స్వయం సేవక సంఘ్ స్థాపనజరిగినప్పటినుంచి హిందూ జాగరణ ప్రారంభంఅయింది. నేడు R.S.S. మరియు దాని అనుబంధ సంస్థల ద్వారా హిందూజాగరణ అంతర్జాతీయ స్థాయిలో సాగుతున్నది.

వివేకానందునివలే ప్రతియువకుడూ హిందూ ధర్మ దుందుభిని విశ్వం అంతటా మ్రోగించాలని కోరుతున్నారు. (వి.హిం.ప. కేంద్రీయ సంయుక్త ప్రధాన కార్యదర్శి శ్రీ సదానందజీ కాకడేగారి 15.12.1996 యువతా సమ్మేళనం సమారోప ప్రసంగం నుండి.

సం.

పేరు 'సెక్యులర'ని పెద్ద ప్రచారమా?!
ముస్లి మీకరణకు ముఖ్యులౌచు
జాతియైక్యత దిగ జార్చిరీపాలకుల్
విశ్వహిందు వాణి వినుడు వినుడు
**- సుందరం.**




# జైహింద్ తత్త్వవేత్త నేతాజి

– డా॥ కసిరెడ్డి

ఇది నేతాజీ సుభాష్ చంద్రబోసు శతజయంతి సంవత్సరం. ఆయన జనవరి 23న జన్మించారు.

*1996* జనవరి 23 నుండి *1997* జనవరి 23 వరకు నేతాజీ శతజయంతి ఉత్సవాలను ప్రభుత్వం నిర్వహించింది. ప్రజలూ నిర్వహించారు.

విదేశీయ బ్రిటీషువారిని పారద్రోలడానికి శక్తినీ, సాహస పరాక్రమాల్ని ప్రయోగించాల్సిందే అని దీక్షతో పోరాటం నెరపిన మహాయోద్ధ నేతాజి. అయితే ఆయన గొప్ప తత్త్వవేత్త. చదివే కాలంలో కూడా తత్త్వశాస్త్రమే ఐచ్ఛిక అధ్యయనాంశంగా స్వీకరించారు. హిందూపదం దేశార్థంలో, ధర్మార్థంలో, సంస్కృతి అర్థంలో, తత్త్వార్థంలో ఉపయోగించేదే అని ఆయనకు తెలుసు. 'మతం' అర్థంలో హిందూ పదాన్ని ప్రయోగించరాదని తెలుసు.

ఈ సంగతి నెహ్రూకు తెలుసు; ఇందిరాగాంధీకి తెలుసు. అందుకే ఉపన్యాసం అయిపోయిన తర్వాత వారు 'జైహింద్' అనే నినాదం ఇచ్చేవారు. అదే ఒరవడిలో ఇప్పుడు కూడ ఎందరో నాయకులు తమ తమ ఉపన్యాసాలు పూర్తయిన వెంటనే జైహింద్ అంటున్నారు.

జైహింద్ అంటే హిందూ దేశానికి, హిందూ తత్త్వానికి, హిందూ సంస్కృతికి, హిందూ ధర్మానికి – హిందువుకూ జయము కలుగుగాక అని అర్థం, ఈ మధ్యే సుప్రీం కోర్టు కూడా ఒక తీర్పునిస్తూ హిందూ పదం మతవాచకం కాదంది. అది ఒక జీవన విధానమన్నది. మా జీవన విధానం ఇదని ఎవరైనా చెప్పుకోవచ్చునని, అనుసరించ వచ్చునని ఆ తీర్పు సారాంశం.

ఇవాళ నేను హిందువునని, హిందువు చెప్పుకోవడానికి వెనక ముందాడాల్సిన పనిలేదు. వైష్ణవం, శైవం, గాణాపత్యం, సౌరం, కాపాలికం, శాక్తేయం, బౌద్ధం, జైనం, ఇస్లాం, క్రైస్తవం మతపదాలవుతాయి గాని ''హిందూ'' పదం కాదు. అందువల్ల హిందుత్వ పదం అతి విశాలమైందని, సంకుచితమైన భావాలకు అది అతీతమైందని గ్రహించాలి. హిందూ పదాన్ని అనేక గ్రంథాలు వ్యాఖ్యానించాయి. స్వామి వివేకానందులు సింధు పదమే హిందువైందని అన్నారు.

శ్లో॥ గోషుభక్తి ర్భవేద్యస్య – ప్రణవేచ దృఢామతిః ।
పూర్వజన్మని విశ్వాసః సవైహిందురితిస్మృతిః॥

గోవులపై భక్తి ఉన్నవారు, ఓంకారంపై దృఢభక్తి కలిగినవారు, పూర్వజన్మపై విశ్వాసం ఉంచినవారు (పునర్జన్మ నమ్మేవారు) హిందువులని భావించాలి.

శ్లో ॥ అసింధో: సింధుపర్యంతా - యస్య భారత భూమికా।
పితృభూ: పుణ్యభూశ్చైవ - సవైహిందురితిస్మృతి:॥

సింధూనది నుండి హిందూ మహాసముద్రం వరకు ఉన్న భూభాగాన్ని తమ పితృభూమిగా పుణ్యభూమిగా ఎవరు భావిస్తారో వారు హిందువులనబడతారు.

శ్లో॥ యోవర్ణాశ్రమ నిష్ఠావాన్ - గోభక్తి: శ్రుతి మాతృక: ।
మూర్తీచనావజానాతి - సర్వధర్మ సమాదర:।
ఉత్ప్రేక్షతే పునర్జన్మ - తస్మాన్మోక్షణ మీహతే ।
భూతానుకూల్యాంభజతే - సవై హిందు రితి స్మృత:।
హింసాయాదూయతేచితం - తేవ హిందు రితీ రితమ్॥

చాతుర్వర్ణాలపై, చతురాశ్రమాలపై (బ్రాహ్మ; క్షత్రియ, వైశ్య, శూద్ర - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాస) నిష్ఠ ఉన్నవారు, గోవును భక్తితో పూజించేవారు, వేదమును తల్లిగా భావించేవారు (వేదమాత), సర్వధర్మాల్ని సమాదరించేవారు, విగ్రహాలను పూజించేవారు, పునర్జన్మను నమ్మేవారు, ముక్తిని కోరేవారు, ప్రాణుల కనుకూలముగా వ్యవహరించేవారు, హింసను దూషించేవారు హిందువులని పిలువబడతారు.

శ్లో ॥ ఓంకార మూలమంత్రాఢ్య: పునర్జన్మ దృఢాశయ: ।
గోభక్తో భారత గురు: - హిందూ హింసన దూషక: ॥

ఓంకారాన్ని మూలమంత్రంగా తలచేవారు, పునర్జన్మపై గట్టి నిశ్చయమున్నవారు, గోవును పూజించేవారు, భారతాన్ని గురువుగా భావించేవారు, హింసను దూషించేవారు హిందువని పిలువబడతారు.

హిందూ తత్త్వశాస్త్రాలెన్నో అధ్యయనం చేసిన నేతాజికి ఈ పదంలోని గొప్పతన మేంటో తెలుసు. అందుకే స్వాతంత్ర్య పోరాటానికి జైహింద్ నినాదాన్ని తారక మంత్రంగా ఉపయోగించుకొన్నారు. అజాదు హిందు ఫౌజును స్థాపించారు. అజాదు హిందు రేడియోను నెలకొల్పారు. అజాదు హిందు సిక్కాను ముద్రించారు.

హిందూ పదంతో ఈ దేశం జనతలో ఒక ఉత్తేజం వస్తుందని ఆ మహాతత్త్వవేత్త గుర్తించినందుకే ఈ పదాన్ని ఇంతగా ఉపయోగించుకొన్నారు. ఈ దేశ, ధర్మ, సంస్కృతి, జాతి, తత్త్వ పరిరక్షణకు ఈ పదాన్ని ఎవరుపయోగించినా వారు నేతాజీ మార్గాన్ని అనుసరించేనట్లే లెక్క. నేతాజీ శతజయంతి సంవత్సర సందర్భంగానైనా ఈ పందంలోని గొప్పతనం గుర్తిద్దాం. ఆ పదంతో అద్వైత సిద్ధిని పొంది జీవిద్దాం; నలుగురు జీవించేట్లుగా వ్యవహరిద్దాం.




# భాగవతం - శ్రీ కృష్ణ తత్త్వము

Dr. M.V.R. శర్మ

(శ్రీ) కృష్ణుడు చీర (వస్త్రము)లను దొంగలించినాడు
ఆ దొంగలించిన వస్త్రములతో (శ్రీ) కృష్ణుడు చెట్టెక్కి కూర్చున్నాడు.
ఉద్యద్గంధ గజేంద్ర గౌరవముతో యోషాంబరంబు ల్విభుం
డాద్యుం డర్భకు భంగి నర్భకులతో హాసార్థియై కొంచుద
న్యద్యంభః కణ శీతవాత జనితా నందంబుతోనెక్కె దా
సద్యోముక్త దురంత పాదప జనుస్సంతాపమున్నీ పమున్.

అ విద్యా – ఆవరణమనే వస్త్రాన్ని పరమాత్మ తీసి వేస్తున్నారు. ఆ తరువాత భగవంతుడు నీప వృక్షాన్ని ఎక్కి కూర్చున్నాడు. నీప మని మనుష్యజన్మ మనకే పేరు. జన్మ సాఫల్యమగు సచ్చిదానందమును పొందుట మనుష్యజన్మ మునందే సంప్రాప్తమగును. ఇతర నీచ జన్మలయందు ఆ అవకాశము లేనందున మనుష్య దేహమును ధరించు అవకాశము కలిగినప్పుడు ''అ విద్యా'' అనే ఆవరణాన్ని – గుడ్డను – తొలగించి అఖండ, అద్వితీయ ఆనందాన్ని అనుభవించేందుకు ఉద్యమించాలి తప్ప ఇంద్రియ సుఖాదులను అభిలషించ గూడదని భావము. నీప వృక్షమునకు తెలుగులో కడిమి చెట్టని పేరు. చేసిన పూర్వజన్మ కర్మలను బట్టి ప్రకృత జన్మయందు కొందఱు ఉచ్చములైన పనులను, మఱి కొందరు నీచములైన కర్మలు చేయ సమర్థులగుదురు. ఆయా అవకాశములు పొందుటవొక విషయము; ఆ పనులు చేయుట మఱియొక్కటి. అవకాశము దొరికీ ఆ పనులు చేయని వారికి జన్మ సార్థకత లేదు. కానైతే, ఆవకాశము మెండుగా లేని పరిస్థితులలో నుండియు యథాశక్తి జన్మసాఫల్యమునకు ప్రయత్నించు వారు ఉత్తరోత్తరా ఉత్తమ శ్రేణి జన్మలలో పయనించి కృతార్థులగుదురు. వేదవేదాంగములు చదువగలిగిన ధీశక్తి వుండియు రోజుకొక గంటయు అభ్యసించని వాడు తన శక్తి యుక్తులను వృధాగావించినవాడు. మరొకనికి సంస్కృతాభ్యసనము, పురాణ పఠనము, సత్సంగము ఇతిహాసములను చదువుట యిత్యాదులు ఆలభ్యములు. ఈతడు రామ రామ యనుచున్నంత మాత్రమున ముక్తి కాంతను సులువుగా చేరు కొనగలడు. వినయ, వినమ్ర భావములు అందరికిని వుండదగినవే అయినప్పటికిని, పాండిత్యము పొందిన కొలది అవి తగ్గుచుండుట, అహంభావము పెరుగుట లోకవృత్తము. అహంభావి భగవంతునికి దూరమగును. అజ్ఞాని అయిప్పటికిని నమ్రభావమున్నచో మహాదృష్టమునే పొందగలడు. కడిమి అనగా చివరిదైన చెట్టు కృష్ణ పాద సంస్పర్శకు సదా నోచుకున్నది! సంస్కృతమున ణీఞ ప్రాపణే యని యున్నందున నీప వృక్షమునకు బ్రహ్మానందమును పొందించునదని యర్థము.

కృష్ణుడు చీరలతో చెట్టు నెక్కుట గమినంచిన గోపికలు (అవిద్యా ఆవరణం తొలిగే దశలోవున్న కర్మఫలం) యిలా అన్నారు.

మామా వలువలు ముట్టకు, మామా కొని పోకు పోకు మన్నింపు తగన్.
మామానమేల కొనియెదు మామానస హరణమేల మానుము

జీవునకు అనగా కర్మఠునకు యీ తరుణమున గోపికలకు తల్లి - ప్రజ్ఞ. ఈ ప్రజ్ఞకు తోబుట్టువు, మేనమామ, బ్రహ్మ తత్త్వము. కనుక కర్మఠులకు బ్రహ్మతత్త్వము మేనమామ. మాకు అనాదిగా వున్నట్టి యీ కర్మకాండ అలాగే వుండనీ. ఆ కర్మ కాండ ద్వారానే మేము ఎంతో కొంత గౌరవాన్ని పొందుతున్నాము. స్వామీ, దీన్ని నీవు పరిపాలించి, మమ్ము అవమానమునకు గురిచేయకు మని ప్రార్థన, ''మన్నింపదగున్'' అ విద్యను తొలగింప గూడదని ప్రార్థించుట సరైనది కాదని తెలిసినందున క్షమింప దగున్ అని ముక్తాయింపు.

కర్మఠులకు జ్ఞానోదయ మవుతన్నా సరే యింకా ఆ పాత సంస్కారాలను (చీరలను) విడువలేని సందిగ్ద, డోలాయమాన మానసిక స్థితి కనులకు గట్టినట్లు యీ పద్యమున విద్యమానమైనది.

## **అమృతవాణి** ఉద్యమంతోనే పనులు

శ్లో॥ కాష్ఠాదగ్నిర్జాయతే మధ్యమానాత్
భూమిస్తోయం ఖన్యమానా దదాతి
సోత్సాహానాం నాస్త్య సాధ్యం నరాణాం
మార్గా రబ్ధా: సర్వయత్నా: ఫలంతి॥

బాగా ఒరిపిడి పెడితే కట్టెలో నిప్పు పుడుతుంది. అలాగే తవ్వితే భూమి నీరిస్తుంది. ఉత్సాహవంతులయిన మానవుల కసాధ్యమనేదేదీ లేదు. సరైన సమయం గుర్తించి చేసే ప్రయత్నాలన్నీ ఫలించితీరుతాయి.

యజ్ఞాదుల్లో రెండు కొయ్యలు ఒరిపిడితో అగ్నినిరగిల్చి ప్రజ్వలింపచేస్తారు.

తొలకరి గుర్తించి రైతు భూమి దున్నుతాడు. సరైన సమయంలో విత్తనాలు వేస్తాడు. నిరంతరం కృషితో మంచి పంటలు పండిస్తాడు. ఏదైనా అంతే.

'' ఉద్యమేనహిసిధ్యంతి కార్యాణిన మనోరథై:''

ఉద్యమంతో పనులవుతాయి కాని ఒట్టి కోరికల వల్లకాదు.

విద్వన్మణి
- కూచిభట్ల చంద్రశేఖరశర్మ.

మహయో ఘ: **శ్రీ పాదవల్లభులు - 1323 1344**

కురువపురంలో జరిగిన మరొక అద్భుతలీల. శ్రీపాదశ్రీవల్లభులు సకలతీర్థ స్వరూపులైనా సాధకులకు సన్మార్గం చూపటం కోసం ప్రతిదినం మూడువేళలా కృష్ణానదిలో స్నానం చేసి అర్ఘ్యాదివిధులు నిర్వర్తించి మఠానికి తిరగి వస్తుండేవారు. వారు స్నానానికి పోయి వచ్చేటప్పుడు ఒక చాకలి ప్రతి దినం దర్శించి సాష్టాంగ పడుతూ ఆనందించేవాడు. అతని భక్తికి మెచ్చి స్వామి ఒకనాడు పల్కరించినారు. ఆనాటి నుండి ఆ రజకుని సంసారచింత నశించి భక్తి శ్రద్ధలు ఎక్కువైనవి. అతడు ప్రతిదినం స్వామివారి ఆశ్రమప్రాంగణం ఊడ్చి చల్లిన తరువాత తన కులవృత్తికోసం పోయేవాడు. అతని సేవలకలరి స్వామి ఒక వైశాఖమాసంలో అతనితో "నీవు రాజువై రాజ్యమేలు తావురా" అన్నారు. స్వామి మాటలతని కర్థంకాలేదు. ఒకనాడు ఆ చాకలి నదిలో బట్టలుతుకుతుండగా ఒక యవన (తురక) యువరాజు సుందరసఖీజనంతో సేవక పరివారంతో విహారార్థం నదికి వచ్చినాడు. అతని వైభవము ఆ సుందరదృశ్యమూ చూచి చాకలిమనస్సు ఉవ్విళ్ళూరింది. ఇంతలో శ్రీపాద శ్రీవల్లభులు నదికి స్నానానికి వచ్చినారు, అతని మనస్సు గ్రహించినారు. అతనితో "ఏమిరా! నీకు రాజ్యభోగాలు అనుభవించవలెననే కోరిక కలిగిందా సంకోచించక చెప్పు! నీకా భోగాలు ఈ జన్మలోనే కావలెనా వచ్చేజన్మలో కావలెనా చెప్పు"మన్నారు. అతడు "స్వామీ! ఇప్పుడు నేను ముసలివాణ్ణి ఐనాను. నాకు రాజ్యభోగాలబ్బినా ఈ వృద్ధాప్యంలో తృప్తిగా అనుభవించ లేను. మరుజన్మలో అనుగ్రహిస్తే ఆజన్మాంతం అనుభవించగలను" అన్నాడు. శ్రీపాదులు "నీవు మృధుర దేశంలో యవన రాజువై జన్మిస్తావు" అని వరమిచ్చినారు. వెంటనే ఆచాకలి "నేను యవనరాజునై జన్మించినా మీకు దూరం కావద్దు. మీ యందు దృఢమైన భక్తిని గూడ అనుగ్రహించండి" అని వేడుకున్నాడు. శ్రీపాదులాతని సద్బుద్ధికి సంతోషించి "నీవు యవనరాజువై సమస్త భోగాలు అనుభవిస్తావు. నీకు మతద్వేషం ఉండదు. మేము నృసింహ సరస్వతి అనే యతీశ్వరులుగా నీవృద్ధాప్యంలో మరల దర్శనం ఇస్తాము. అపుడు నీకు జ్ఞానోదయం ఔతుంది పో!" అని, ఒక వింతైన చూపు అతనిపై ప్రసరించినారు. తత్క్షణమే ఆరజకుడు క్రిందపడి ప్రాణాలు విడిచినాడు. శ్రీపాదులు పేర్కొన్న 'మృధుర' ఈనాటి బిదరు లేదా బిజాపూరు నగరాలు కావచ్చునని చారిత్రకుల అభిప్రాయం. అప్పడీ రెండు పట్టణాలు బహ్మనీ రాజ్యం లోనివే. శ్రీపాదశ్రీవల్లభులు కురువపురంలో ఇట్టి లీలలెన్నో ప్రదర్శించి ఒక ఆశ్వయుజమాసం బహుళ ద్వాదశి హస్తానక్షత్రం నాడు కృష్ణానదిలో అంతర్హితులైనారు. ఐనా కురువపురంలో సూక్ష్మరూపంలో ఉంటూ ఇప్పటికీ భక్తులను అనుగ్రహిస్తున్నారు.

శ్రీవారు సూక్ష్మరూపంలో ఉంటూ ప్రదర్శించిన అద్భుత లీలల్లో ఒకటి. కాశ్యపసగోత్రీకుడైన వల్లభేశుడనే బ్రాహ్మణుడు వాణిజ్యం చేసేవాడు. ఏటేటా కురువపురం వచ్చి సేవించి పోయేవాడు. ఒక సంవత్సరం అతడు తనకు వ్యాపారంలో బాగా లాభం వస్తే కురువపురంలో వేయిమంది బ్రాహ్మణులకు సంతర్పణ చేస్తానని మ్రొక్కుకున్నాడు. ఆ సంవత్సరం అతడు ఆశించినదానికంటె అధికలాభం వచ్చింది. మ్రొక్కు చెల్లించటానికై పైకం మూటకట్టుకొని కురువపురం బయలు దేరినాడు. అతని వద్ద ధనం ఉన్నదని పసికట్టి ముగ్గురు దొంగలు యాత్రికులవలె ఆతణ్ణి వెంబడించినారు. త్రోవలో మరొక యాత్రికుడు తోడైనాడు. రెండు మూడు దినాలు కలిసి ప్రయాణం చేసిన తరువాత నిర్మానుష్యమైనచోట దొంగలు అతనిపై బడి సొమ్ముదోచుకొని తలకోసినారు. చనిపోయేముందు వల్లభేశుడు "శ్రీపాదశ్రీవల్లభా" అని బిగ్గరగా ఆర్తనాదం చేసినాడు. దొంగలాతని శరీరాన్ని ఎవరూ గుర్తించకుండునట్లు తగుల బెడుదామనుకుంటుండగా భక్తరక్షాపరాయణుడైన

శ్రీపాదశ్రీవల్లభులు జడలు భస్మం త్రిశూలం ధరించిన యతిరూపంలో హఠాత్తుగా ప్రత్యక్షమై ఆ దొంగలను పొడిచి చంపినారు. నాల్గవవాడు తాను దొంగకాదని మొరపెట్టుకుంటే వాని కభయం ప్రసాదించినారు. శ్రీపాదులాతనికి విభూతి ఇచ్చి వల్లభేశుని శరీరంపై చల్లి తలను మొండానికి అతికించుమని ఆదేశించి ఆకళేబరం పై తమ అమృత దృక్కులు సారించి ఆతణ్ణి అక్కడ కావలుంచి అంతర్హితులైనారు. అతడు స్వామి చెప్పినట్లే చేసినాడు. తెగిన తల మొండానికి అతుక్కున్నది. సూర్యోదయ సమయానికి వల్లభేశునికి పూర్తిగా స్పృహ వచ్చింది. వల్లభేశుడు నిద్రమేల్కొన్న వానివలె లేచి తన చెంతనే పడిఉన్నమూడు కళేబరాలను, కాపలా ఉన్నత్రైర్థికుని చూచి ఇదంతా ఏమిటని అడిగినాడు. ఆ నాల్గవ వ్యక్తి జరిగినదంతా చెప్పినాడు వల్లభేశుడు ఇది శ్రీపాదశ్రీవల్లభుల కరుణాద్భుత లీల అంటూ మనసారా కీర్తించి తనకు స్వామివారి ప్రత్యక్షదర్శనం కానందుకు చింతించి ప్రత్యక్ష దర్శనం పొందిన త్రైర్థికుణ్ణి అభినందించి కురువపురం చేరినాడు. పూర్వం అనుకున్నట్లు వేయిమందికి కాక నాల్గువేల మందికి అన్న సంతర్పణం చేసి దక్షిణ తాంబూలాలు దండిగా పంచినాడు. ఈ విధంగా శ్రీపాద శ్రీవల్లభులు కురువపురంలో సూక్ష్మరూపంలో ఉంటూ కొలిచిన వారికి కొంగుబంగారమై, తలచిన వారికి త్రాతయై సజ్జనులకు నిజరూపంలో సాక్షాత్కరిస్తున్నారు

శ్రీపాదులవారి ఆదేశానుసారం జీవితమంతా శివపూజ చేసిన అంబిక మరుజన్మలో మహారాష్ట్ర దేశం ఆకోలాజిల్లా కారంజా నగరంలో అంబగా జన్మించినది. యుక్తవయస్సులో మాధవశర్మను పెండ్లాడి శివపూజ శని ప్రదోషపూజలు అవ్యాహతంగా చేసి 16 ఏండ్ల దాంపత్యం నెరపి దత్తాత్రేయుల మూడవ అవతారం శ్రీనరసింహసరస్వతిని కన్నది. ఆయన 9 వయేట ఇల్లు విడిచి పోయే ముందు అంబకు శ్రీపాద శ్రీవల్లభులుగా దర్శనమిచ్చి పూర్వజన్మ విషయాలు గుర్తు చేసినారు. వెళ్ళిపోతూ గ్రామం బయట మరల ఒకసారి కర్పూరకాంతి గల దత్తస్వామి వలె, శ్రీపాదులవలె దర్శనం ప్రసాదించినారు అంబకిచ్చినమాట ప్రకారం 30 ఏండ్ల తరువాత కారంజాకు తిరిగివచ్చి మరొకసారి శ్రీపాదుల రూపంలో దర్శనమిచ్చినారు. పిఠాపురంలో జన్మించి కురువపురంలో సూక్ష్మరూపంలో ఉంటున్న శ్రీపాదశ్రీ వల్లభులు దత్తసంప్రదాయం వారికందరికీ పరమారాధ్యులు. ఆధునికకాలంలో ఎందరోమహాయోగులు కురువపురంలో తపస్సు చేసినారు. శ్రీవాసుదేవానంద సరస్వతి, రంగావధూత, అవధూత స్వామి, గోళప్పయోగి, గుణవళిమహారాజు, శ్రీధరస్వామి, వాలకేశ్వరస్వామి, అలుకూరు శ్రీనివాసశాస్త్రి, ఖండేరావు మాణిక్యప్రభువు, అక్కల కోట గజానన మహారాజు, శివానందస్వామి, రామకృష్ణమహారాజు, సచ్చిదానందస్వామి, నారాయణ మహారాజు, అష్టదత్తమహారాజు, ప్రభుదాస్ అప్పామహారాజు, చింతామణి స్వామి, బ్రహ్మచారి మహారాజు, కవీశ్వర దత్తమహారాజువంటి మహాత్ములెందరో కురుగడ్డలో తపస్సు చేసినారు.

శ్రీపాద శ్రీవల్లభుల జీవితకాలం గురుచరిత్రలో ఇదమిత్థంగా లేదు శ్రీ ఎక్కిరాల భరద్వాజ గారి అనువాదంలో శ్రీపాదులు ఒక భాద్రపదశుక్లచతుర్థినాడు జన్మించినట్లున్నది సంవత్సరం పేరు లేదు. మిగతా మూడు అనువాదాల్లో భాద్రపదశుక్ల చతుర్థి ప్రసక్తి లేదు. శ్రీపాదశ్రీవల్లభులు అవతారం చాలించినది, ఆశ్వయుజ బహుళద్వాదశి హస్తానక్షత్రమని మూడు అనువాదాల్లోను శుద్ధద్వాదశి అని ఇసుకపల్లి వారి అనువాదంలోను ఉన్నది. నాల్గు అనువాదాల్లోను సంవత్సరం పేరు లేదు. కనుక వారి జనన మరణాల కాలం ఇతరాధారాలతో నిర్ణయించవలసిందే. శ్రీవారి తరువాతి అవతారం 15 వ శతాబ్దంలో ఉండిన శ్రీనరసింహ సరస్వతీ స్వామివారు. ఆయన జనన కాలం గూడ ఈనాల్గు అనువాదాల్లోను లేదు కాని అవతారం చాలించినది బహుధాన్య సంవత్సరం మాఘమాసం బహుళపాడ్యమి శుక్రవారం

పుష్యమీ నక్షత్రం బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించినప్పుడని ఉన్నది. దాని ఆధారంగా పూర్వచారిత్రకులు శ్రీనరసింహసరస్వతి అవతారం చాలించినది క్రీ.శ.1456 అని నిర్ణయించినారు. వారి ఆయుః ప్రమాణం 51గా నిర్ధారించి 1405 - 1456 శ్రీవారి జీవితకాలమని నిర్ణయించినారు కాని ఆచార్య ఎక్కిరాల భరద్వాజగారు శ్రీనరసింహసరస్వతి ఆయుఃప్రమాణం 80 ఏండ్లుగా గుణించి 1376-1456 శ్రీవారి జీవితకాలమని నిర్ణయించినారు. గురుచరిత్రలో శ్రీనరసింహసరస్వతి తమదేహం చాలించినది, బహుధాన్య సంవత్సరమని ఉన్నది కదా! బహుధాన్య క్రీ.శ.1456 కావటంలేదు బహుధాన్య క్రీ.శ.1459లో వచ్చింది. (అది శాలివాహనశకం 1381) ఐతే మాఘబహుళపాడ్యమి శుక్రవారం నాడు(19-1-1459) పుష్యమి నక్షత్రం లేదు; ఆశ్లేష ఉన్నది. పుష్యమి నక్షత్రం బహుధాన్యమాఘశుద్ధ పూర్ణిమ(18.1.1459) గురువారం నాడున్నది. స్థూలంగా క్రీ.శ. 1459 జనవరిలో శ్రీనరసింహ సరస్వతీ స్వామి దేహం చాలించినారని భావించవచ్చు. వారి ఆయుః ప్రమాణం 80 ఏండ్లనుకుంటే వారి జీవితకాలం 1369-1459 ఔతుంది. ఈ రెండవతారాలకు మధ్యావధి 25సంవత్సరాలన్నారు. శ్రీపాదులు జీవించినది 21 ఏండ్లు మాత్రమే కనుక శ్రీపాద శ్రీవల్లభుల జీవిత కాలం క్రీ.శ. 1323-1344 అని నిర్ణయించవచ్చును. ఈనిర్ణయం సరియైనదనుకుంటే శ్రీపాదులు శా.శ.1245 రుధిరోద్గారి భాద్రపదశుద్ధచవితి శనివారం 6-8-1923 నాడు పుట్టి శా.శ.1266 తారణ ఆశ్వయుజ బహుళ ద్వాదశి సోమవారం 4-10-1344నాడు దేహం చాలించినారు. 1323లోనే ఆంధ్రదేశంలో కాకతీయ భానుడస్తమించినాడు. 1324-1344మధ్యకాలంలో ఆంధ్రదేశం మృత్యుముఖంనుండి బయటపడి ముసునూరి సోదరుల అధీనంలోనికి వచ్చింది. ఐతే శ్రీవారు కురుగడ్డిలో తమ అవతారం చాలించేనాటికి (1344) ఆప్రాంతం ముస్లింల ఏలుబడిలోనే ఉండినది.

శ్రీపాద శ్రీవల్లభులు అవతారం చాలించే కొలది మాసాల ముందు ఒక చాకలికి తురకరాజుగా పుట్టే వరమిచ్చినారు. తాము నరసింహసరస్వతిగా అవతరించి జీవితాంతంలో మరల కలుసుకునే భాగ్యం కల్పించినారు. శ్రీనరసింహ సరస్వతి దేహం చాలించే ఒకటి రెండు సంవత్సరాలముందు బిదరు సుల్తానుకు వ్రణబాధ నయం చేసి ఆతని ఆహ్వానం మన్నించి పాపవినాశతీర్థంనుండి బిదరుకు పోయినట్లు గురు చరిత్రలో ఉన్నది. ముస్లింముల్లాలు మంత్రులు కూడదని హితోపదేశం చేసినా ఆసుల్తాను మతసామరస్యం పాటించి శ్రీనరసింహ సరస్వతీస్వామిని తన అంతఃపురంలో సన్మానించినట్లు గురుచరిత్ర వర్ణిస్తుంది. ఎవరీ సుల్తాను? శ్రీ నరసింహ సరస్వతి 1369-1459 మధ్యకాలంలోని వారైతే సమకాలీనతను బట్టి బిదరు ఏలిక బహ్మనీ సుల్తాన్ రెండవ అలావుద్దీన్ అహ్మద్‌షా (1436-1458) కావలెను. కాని ఆ సుల్తాన్ నిజంగా మతసామరస్యం పాటించినాడా?, గుళ్ళు గోపురాలు మసీదులుగా మారిన కాలమది. గురుచరిత్రకు వాస్తవ చరిత్రకు పొంతన కుదరటంలేదు.

"దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా
దిగంబరా దిగంబరా శ్రీ అవధూత చింతన దిగంబరా"

ఆధారాలు:-

1. శ్రీగురుచరిత్ర - ఆచార్య ఎక్కిరాల భరద్వాజ - ఒంగోలు 1990
2. శ్రీదత్తావతారమాహాత్మ్యం - ఆచార్య ఎక్కిరాల భరద్వాజ - ఒంగోలు 1995.

ఆచార్య బి. రామరాజు

మన పండుగలు

# ''సంబరాల సంక్రాంతి''

- RVN సుబ్బారావు

''ఉత్తరాయణమని, ''దక్షిణాయనమని, సంవత్సరములో రెండు అయనములు- ఆరు నెలల కొకటి చొప్పున వచ్చుచుండును-సూర్యుడు కటక (కర్కాటక) రాశిలో ప్రవేశించుటతో-దక్షిణాయనము, ప్రారంభమగును. సూర్యుడు మరల మకరరాశిలో ప్రవేశించగానే - ఉత్తరాయణము ఆరంభమగును. ఉత్తరాయణము దేవతలకు పగలని, దక్షిణాయనము వారికి రాత్రి అని అంటారు. ఈ రెండు కలసి దేవతల కొక రోజు కాగా, మనకు ఒక సంవత్సరమగును.

ఆషాడ మాసము రాగానే, ఏకాదశినాడు విష్ణుమూర్తి క్షీరసాగరమున శేషతల్ప శాయి అగును. అందుకే ఆ ఏకాదశిని 'శయనైకాదశి' అని, 'తొలి ఏకాదశి' అని అంటారు. అది దక్షిణాయనమును సూచించును. మార్గశిరమాసములో ఏకాదశినాడు విష్ణుమూర్తి నిద్రనుండి మేల్కొనును. అందుచే ఆ ఏకాదశిని - '' ఉత్థాన ఏకాదశి'' అని, వైకుంఠద్వారములు తెరచు కొనుటచే వైకుంఠ ఏకాదశి' అని, ముక్కోటి దేవతలు కూడా మేల్కొనుటచే ''ముక్కోటి ఏకాదశి'' అని అంటారు. అందుకే వైకుంఠ ఏకాదశినాడు తెల్లవారుఝామున విష్ణుమూర్తి ఉత్సవవిగ్రహాన్ని ఉత్తర ద్వారము వైపున దర్శనమిచ్చునట్లు గుళ్ళల్లో ఏర్పాటు చేసెదరు.

దీని విశేషము మనకు భారతంలోకలదు. యుద్ధములో అర్జునుని ముందుశిఖండిని చూచి యుద్ధ విముఖుడైయున్న భీష్మునికి అర్జునుని బాణాలు తగులగా అంపశయ్యపై పడిపోవును. తానుకోరినప్పుడే, చనిపోగలడు (స్వచ్ఛంద మరణుడు) కనుక భీష్ముడు, ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చు వరకు వేచి యుండి, ఏకాదశినాడు, శ్రీకృష్ణుని సాన్నిధ్యములో తనప్రాణాలు వదిలిపెట్టును. ఆతని ప్రాణాలు శ్రీకృష్ణ పరమాత్మునిలో లీనమైనవి. అప్పటి నుండి అవి, 'భీష్మేకాదశి' గా పిలువబడుచున్నది.

ఈ మార్గశిర మాసములోనే సూర్యుడు బహుళ పాడ్యమి ధనూరాశిలో ప్రవేశించుటచే దీనిని 'ధనుర్మాస' మని కూడ పిలచెదరు. ధనుర్మాసారంభమునుండి, రంగు-రంగుల-రంగవల్లులు ప్రారంభమై సంక్రాంతి వరకు సాగును. చలిని కూడ మరచి, బాలికలు, స్త్రీలు, తెల్లవారు ఝాముననే లేచి, ప్రతి రోజు రంగురంగులైన ముగ్గుతో వాకిళ్ళలో తీర్చిదిద్దెదరు. వాటిపై ( ఆవు) పేడతో గొబ్బిళ్ళు పెట్టి, పూలతో పూజించి, పొంగలి (ముద్గాన్నము) నైవేద్యము పెట్టెదరు. సంక్రాంతి అందరకు సంబరాన్ని చేకూర్చే సంక్రాంతి పండుగ.సంక్రాంతి వేడుకలిట్లా రంగవల్లులతో ప్రారంభమౌతవి. ఇది సంక్రాంతి పూర్వరంగము.

కృషిప్రధానమైన భారతదేశంలో, పంటలు చేతికందగానే మూడు రోజులు జరుపబడే పండుగ-సంక్రాంతి- అందుకే ఇది గొప్ప, బీద అన్న విచక్షణ లేకుండా అందరి చేజరుపబడు వేడుకైన పండుగ. మొదటి రోజు ''భోగి'' రెండవరోజు అసలు పండుగ ''సంక్రాంతి''. మూడవ రోజు ''కనుము''- భోగి రోజున 'భోగిమంటలతో' చలికాచుకొంటారు. దీనిని ఉత్తరాదిన 'లోడి' అని అంటారు. చలికాలం ఆరోగ్యప్రదమైన పొంగలిని, (అల్లం, మిరియాలు మొ॥వాటితోకూడిన అన్నము) భగవంతునికి నైవేద్యము పెట్టి ప్రసాదాన్ని తినెదరు. సాయంత్రం పిల్లలకు 'భోగిపళ్ళు' పోసి, పళ్ళు-శనగలు వగైరాలతో వచ్చిన పేరంటాళ్ళకు పంచిపెట్టే, వేడుక చేసికుంటారు.

కొన్ని ప్రాంతాలలో స్త్రీలు, ఈ భోగి నాటి నుండి నాలుగు రోజులు ''గొబ్బిగౌరీ వ్రతం'' ఘనంగా చేసుకొంటారు. నాలుగవ రోజున బంకమట్టితో చేసిన ఆగౌరీ దేవికి పూజలు చేసి, నివేదన పెట్టి, దీప ఉద్వాసన చెప్పి, చెరువులలో గానీ, నదులలో గాని ఉత్సర్జన చేసెదరు. గౌరీదేవి మంటపానికి కట్టిన కూరలను వండి, ప్రసాదంగా సేవించెదరు. దీనినే ''గొబ్బి'' అని అంటారు.

కొందరు స్త్రీలు పుట్టినింటి వారి క్షేమానికై ''కాకి పిడచలు'' పెట్టెదరు. కొందరు భోగినాటినుండి, పది రోజుల పాటు 'బొమ్మల కొలువు' పెట్టి, ప్రతి రోజు పేరంటాళ్ళను పిలచి వేడుకలు చేసికొనెదరు.

రెండవరోజు ''సంక్రాంతి''. ఇది ముఖ్యమైన రోజు. ఇది పర్వదినము కూడ అగుటచే, ప్రాతఃకాలమున నే లేచి, అభ్యంగస్నానమాచరించి, భగవంతుని పూజించి, పితృదేవతలకు తర్పణము వదలి, హిరణ్యయుక్తముగ, కూష్మాండ (గుమ్మడికాయ) దాన మొనరించెదరు. శక్తికి తగినట్లుగ దానధర్మాలు కూడ చేసెదరు. ఏడాది పాటు, పొలాలలోను, ఇళ్ళలోను పనిచేసిన వాళ్ళకు-వారియజమానులు ధాన్యము, క్రొత్తబట్టలు ఇచ్చి, సంతృప్తి పరచెదరు.

చిన్నవాళ్ళు పెద్దవారికి ఉదయం పూట నమస్కరించి, వారి నుండి ఆశీస్సులను పొందెదరు. అందుకే దీనిని ''మొక్కుల పండుగ'' అని కూడ పిలచెదరు. 'నువ్వులు అద్దిన సజ్జరొట్టెను' సంక్రాంతినాడు తినటం, కొన్నిప్రాంతాలలో ఆచారము. ఈ సంక్రాంతి వరకు ఉదయాన్నే హరినామస్మరణ చేసికొనుచు వచ్చే హరిదాసులకు కానుకలిచ్చుట తప్పని సరిగా పాటించెదరు.

మూడవ రోజు ''కనుము''. ఇది కర్షకులకు, పని-పాటల వారికి విశేష మైన రోజు. సంవత్సరమంతా కష్టపడినందుకు వాళ్ళకు ప్రతిఫలం చేతికందేరోజు. ఇంటిల్లిపాదీ ఎంతో వేడుకచేసికొనే రోజు.

రైతులు, వాళ్ళ పశువులను కడిగి అలంకరిస్తారు. పశువుల చావిళ్ళలో పొంగలి వండి నైవేద్యం పెట్టి, దానిలో పసుపు-కుంకుమలు కలిపి, పొలాలలో చల్లుతారు. దీనినే ''పొరిచల్లడ'' మంటారు. ఇది రక్త సిక్తాన్నచలికి బదులుగా పెట్టు సాధునివేదన. తర్వాత గుమ్మడికాయను దిష్టి తీసి, పగుల కొడ్తారు. ఇదికూడ పశుబలికి ప్రత్యామ్నాయముగ జరుపు సాత్త్విక బలి.

ఆరోజు సాయంత్రం పశువుల నలంకరించి, ఊరేగిస్తారు. ఎడ్లు,పొట్టేళ్ళు, కోళ్ళు-వీటితో పందాలు వేస్తారు. గంగిరెద్దుల ఆట ప్రత్యేకాకర్షణ కల్గియుండును.

నాలుగవరోజు ''ముక్కనుము'' పండుగకు వచ్చిన కూతుళ్ళకు అల్లుళ్ళకు కానుకలిచ్చి సాగనంపుతారు.

ఈ సంక్రాంతి, ఇహ-పరాలను కూర్చు 'పెనుబండువు'. (శ్రీనాథుని మాట), కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలతో, చీకు-చింతలు మరచి, సంబరంగా జరుపుకొనే పండుగ. పంటలు చేతికందుటచే, తారతమ్యము లేకుండా అందరు ఆనందంగా చేసుకొనేది సంక్రాంతి.

దేవతలను, పితృదేవతలను, నైవేద్య,తర్పణ, పూజాది కముల చేతను ఆశ్రితులకు తిండిగింజలు, బట్టలు ఇచ్చి సంతృప్తి పరచు ఇహపరసాధకమైన పండుగ ఇది. ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చుటచే, ఈ సమయమున చనిపోయిన వారికి కూడ సద్గతులు కలుగును.

పిల్లలు, పెద్దలకు, ఆడవారికి-మగవారికి, గొప్పవారికి-బీద వారికి అనువైన పెద్దపండుగ ఈ 'సంక్రాంతి'.



అనుభవం

# హిందూయువతులారా - ఉచ్చులో పడవద్దు.

- శ్రీమతి ప్రతిభ బాంబ్రి - వెస్ట్‌మిడ్‌లాండ్స్. ఇంగ్లండు

అద్భుతమైన ఈ భారతదేశాన్ని చూడాలని వచ్చాను. సామాజిక పత్రికలు చదవటం నాకు చాల ఇష్టం. భారతీయ వార్తా పత్రికలలో ' ఇండియా పోస్టు' పత్రిక చాలాబాగుంటుంది. రంగురంగుల పత్రిక. అన్ని సామాజిక విషయాలకు ప్రత్యేక స్థానం కల్పిస్తుంది ఈ పత్రిక. అనిత చక్రవర్తి, బోడన్స్కీలు వ్రాసిన వ్యాసాలు, సంపాదకీయాలు, ఎంతో సమాచారాన్ని అందిస్తాయి. విజ్ఞానదాయకంగా కూడా విశేషాలను ఇండియాపోస్టు పత్రిక ప్రచురణకు ఎంచుకున్నదంటే మనం ఈ పత్రిక ఇంగ్లండ్ ఎడిషన్‌ను చదువుతానని భావిస్తున్నాను. నా అనుభవాలను, ఆలోచనలను ఇంగ్లండులోను, ఇతర దేశాలలోనూ నివసించే భారతీయులతో పంచుకోవాలనుకొంటున్నాను. అలాంటి ఒక అనుభవాన్ని, ఆలోచనను ఇచట వ్రాస్తున్నాను.

నా గ్రాడ్యుయేషన్ చదువుతర్వాత చాల పొరపాటు చేశాను. నాతల్లిదండ్రులు, సోదరులూ ఎన్నిరకాలుగా వారించినా, హెచ్చరించినా వారిమాటలను పెడచెవినపెట్టి నామతస్థుడుకాని బంగ్లాదేశ్ ముస్లిం యువకుని వివాహమాడాను. ఆ సమయంలో నాహిందూ ధర్మం నాకు ఇచ్చిన స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేస్తున్నాననే విషయాన్ని పూర్తిగా విస్మరించాను. ఎవరో ఒక 'ఖాన్'ను పెండ్లాడే ముంబాయి సినిమాలలో నటించే ఆడపిల్లలను అనుకరిస్తున్నాననీ, ఉత్సాహపడ్డాను. కానీ ఈ స్వేచ్ఛానుకరణద్వారా భవిష్యత్తులో హిందూ బాలికలకు నేనొక తప్పుడు ఉదాహరణగా మిగిలిపోతానని ఇపుడు తెలిసింది. మధ్యప్రాచ్యదేశాల (గల్ఫ్‌దేశాల) వారి పెట్రోలు డబ్బుతో నేను మోసగింపబడ్డాననే యదార్థం ఇపుడు అర్థమైంది.

నాపూర్వపు భర్త, వారి కుటుంబ సభ్యులు నేను ధరించే హిందూ సంప్రదాయపు బట్టల విషయంలో ఏవగింపుతో మండిపడేవారు. మతం మార్చుకొమ్మని వత్తిడి చేసేవారు. అప్పుడు నేను చెరపట్ట బడ్డానని తెలుసుకొన్నాను. అయితే ఈ వివాహం కాదని తిరిగి హిందువుగా బ్రతకటానికి వెళ్ళినా నన్ను హిందువులు ఆదరించరనీ, ఏ హిందువూనన్ను వివాహం చేసుకోడని భయపడ్డాను. ఈ భయం వలననూ, నాముస్లింభర్త, కుటుంబసభ్యులు చేస్తున్న నిరంతర వత్తిడివలననూ, నేను హిందు ధర్మానికి చెందిన నాపేరు, కట్టు, బొట్టు ఆఖరికి నాధర్మాన్ని కూడా విడిచి పెట్టి ముస్లింగా మారాను.

ఈ వివాదం ఇక్కడితో ఆగలేదు. మాతల్లిదండ్రులను మరచిపోవాలనీ, వారితో ఎట్టి సంబంధం కలిగి ఉండకూడదనీ ఆంక్షలు విధించారు. ఇదికాక నామహమ్మదీయభర్త చిన్న చెల్లెలు ఒక సిక్కుయువకునితో సఖ్యంగా మెలుగుతోందని ఆమెను చితకబాదేవారు. వారి ఈ రెండు నాల్కల ధోరణికి నాకు అసహ్యం వేసింది. నామనస్సును కలచివేసింది. వెంటనే వారితో విభేదించాను. పోరాడాను ఇక భరించలేక చివరకు విడాకులకు కోర్టుకు వెళ్ళాను.

నేను హిందూ ధర్మాన్ని విడిచినందుకు ఎంతో చింతించాను. హిందూ ధర్మం యొక్క పవిత్రత, చరిత్ర తెలియని కారణంగా ఎంతో వేదనను అనుభవించాను. ఈ దేశంపై దండెత్తి వచ్చిన దేశద్రోహులనుండి ఈ జాతి తనను కాపాడుకొనటానికి చేసిన కృషిని తెలుసుకోలేకపోయాను.

నాకు హిందూ ధర్మాన్ని గురించి తెలిసిందల్లా–దేవాలయానికి వెళ్ళటం, హారతి పాడటం, ప్రసాదం తీసుకోవటం, దేవీనవరాత్రులలో దుర్గాదేవి ఎదుట నృత్యం చేయటం మాత్రమే.

నాహిందూ సోదరీమణులు నావలె పతనం చెంది ముస్లింమతోన్మాదానికి బలికాకూడదని మొదటిసారిగా మన ధర్మాని గురించి నాకు నేనే అధ్యయనం చేశాను. నాకు నేనే అవగాహనకువచ్చాను. ఆ తర్వాత మన ధర్మాన్ని గురించి, యువతరంగురించి, హిందూ వివాహప్రాశస్త్యాన్ని గురించి, హిందూసంస్కృతి, హిందూ జీవన మూల్యాలు నాశనమయ్యే విధంగా ముంబాయినుండి వస్తున్న సినిమాలు మొదలైన విషయాల గురించి ఇంగ్లండులోని హిందూ దేవాలయాలలో ఉపన్యాసాలు ఇవ్వటం ప్రారంభించాను. ఈ దేవాలయాలలో హిందూ నృత్యప్రదర్శనలను ఏర్పాటు చేశాను. ధార్మిక విషయాలపై చర్చలు, గోష్టులు ఏర్పాటు చేసేదాన్ని. హిందూదేవాలయాల నిర్వాహకులు దేవుని గురించే మాట్లాడాలిగాని, ధర్మానికి జరుగుతున్న హానిని గురించి, ధర్మాన్ని పునరుద్ధరించాల్సిన ఆవశ్యకత, గతవైభవం గురించి దేవాలయాలలో మాట్లాడ రాదని, దేవాలయం బయట కార్యక్రమం ఏర్పాటు చేసుకొమ్మని, దేవాలయ ఆవరణలో అనుమతించమని ఆటంకం కలుగచేశారు. ఈ ధోరణి హిందూ ధర్మానికి హానిని కలుగ చేస్తుందని, మనవారందరూ ధర్మ రక్షణకు నడుంకట్టాలనీ ఈ దేవాలయ నిర్వాహకులను వారి ఇండ్ల వద్ద వ్యక్తిగతంగా మాట్లాడి వారిని అంగీకరింపచేసేదానిని.

హిందువులు తమ దేవాలయాలకు సంబంధించిన ఆర్థిక విషయాల విషయంలో పాలుపంచుకోవాలి. పాశ్చాత్యదేశాలలోని, భారతదేశంలోని హిందువులను జాగృతం చేయటానికి దేవాలయ నిధుల నుండి కొంత నిధిని కేటాయించవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది. హిందువులు తమ ఆర్థిక ఆదాయంనుండి ధర్మరక్షణకు తత్సంబంధమైన కార్యక్రమాలకు, ప్రకల్పాలకు కొంతశాతం నిధిని తప్పక సమర్పించాలి. ఈ పనిని హిందువులు మాత్రమే చేయటం లేదు. హిందువులనుండి ఈ ప్రకల్పాలకు నిధులను సేకరించటం అంటే కాలిఫోర్నియా లొట్టోజాక్‌పాట్ గెలవటం కంటే కష్టమైన పని అని తెలుసుకొన్నాను. హిందువులు దేవాలయాలకు మాత్రమే కాక హిందూ జాగరణకోసం పనిచేస్తున్న సంస్థలకు, సంఘాలకు కూడా విరాళాలు ఇవ్వాలి. తల్లిదండ్రులు మనధర్మంగురించి, మనవేదాంతాన్ని గురించిన సందేశాన్ని, పరిజ్ఞానాన్ని తమ సంతానానికి తెలియచేయటానికి తాము స్వయంగా వీటిని గురించి చదవటం ప్రారంభించాలి. చిన్న వయసునుండే తమ కుమార్తెలతో ధర్మం, మతం, వివాహం గురించి చర్చించటం ప్రారంభించాలి. హిందూ బాలికలతో సకారాత్మక, సహజ సంబంధాలను పెంపొందించుకొనే విషయంలో తమ కుమారులను మరీ పట్టుబట్టి కట్టుడి చేయకూడదు.

ముస్లిం యువకులు తమ అక్క-చెల్లెళ్ళ ద్వారా అమాయకులైన హిందూ బాలికలను పరిచయం చేసుకొని క్రమంగా వ్యక్తిగత ప్రేమ సంబంధాలలోకి దించుతారని పరిశీలనో తెలిసుకొన్నాను. అనేక మంది ముస్లిం, అరబ్ దేశాలు ఇలాంటి సంబంధాలకు, పెండ్లిండ్లకు ఆర్థికంగా ఆకర్షణీయమైన మొత్తాలను అందచేస్తారని తెలిసింది. అమాయకహిందూ బాలికలను వివాహం చేసుకొనటానికి ఇతర మతస్తులు ప్రయత్నిస్తుంటే హిందూ యువకులు సహించకూడదు. అలా స్పందించినపుడు సినిమాలో కూడ హిందూ యువకుని ముస్లిం యువతి వివాహం

చేసుకోవటాన్ని సహించని ముస్లింలు హిందూ బాలికలను నాశనం చేసే ప్రయత్నాలు ఆగుతాయి. ముస్లింయువకుడు ఒక హిందూ బాలికతో '' ఈ భూమి మీద నీకంటె అందమైనది మరొకటి లేదు'' వగైరా అన్నాడంటే- అతను ''ముస్లింలు కాని మహిళలను లోబరచుకొని, మతం మార్చడానికి ఏవిధంగానైనా సరే ప్రయత్నించండి'' అనే ఇస్లామిక్ ఆదేశాన్ని పూర్తిచేయటానికే నని హిందూ బాలికను హెచ్చరించాలి. ఇది నా వ్యక్తిగత చేదు అనుభవంతో అంటున్న మాట కాదు. ఇంగ్లండు కాలేజీలలోను, విశ్వవిద్యాలయాలలోను చదువుకొనే ముస్లింవిద్యార్థులకు క్రైస్తవ, హిందూ, సిక్కు బాలికలను, ప్రత్యేకించి సిక్కు బాలికలను వివాహం చేసుకొమ్మని ముల్లాలు జారీచేసిన ఫత్వాలు ( ఆదేశాలు) మీరు తెలిసుకోండి.

విద్యావంతులైన హిందూ యువతులారా!

మీరు, మీ మహోన్నతమైన హిందూ ధర్మం గురించి గర్వించండి. వివాహం చేసుకోవాలంటే మతం మారవలసి ఉంటుందని ఎవరైనా అంటే నీవే హిందువుగా మారమని చెప్పండి. స్వచ్ఛమైన ప్రేమలో మతసంబంధమైన విషయాలు ఉండవు. అని చెప్పండి. అమెరికాలోని హిందూ సంస్థ అమెరికాలోని అన్ని రాష్ట్రాలలోని, అన్ని దేశాలలోని హిందూ యువతకు నృత్య కార్యక్రమాలను, ఇతర కార్యక్రమాలను నిర్వహించి వారందరిని కలసేట్లు చేయాలి. హిందూ యువతకు సరియైన అవగాహనకు, ప్రోత్సాహానికి -''తల్లిదండ్రులకు దూరంగా వివిధ విశ్వవిద్యాలయాలలో స్వేచ్ఛాస్వతంత్రాలతో జీవించే విద్యార్థులు తమకులభించిన స్వేచ్ఛా స్వతంత్రాలను ఎలా సద్వినియోగం చేసుకోవాలి'', ''మోసపూరిత మనసుతో హిందూ యువతుల పట్ల నాటకీయంగా ప్రేమను అభినయించు యితర మతస్థులను దూరంగా ఉంచటం ఎలా?'' మొదలైన విషయాల గురించిన వీడియో ప్రదర్శనలు నిర్వహించాలి. అక్బరు సైనికాధికారులు హిందూ యువతుల పై సాగిస్తున్న దుర్మార్గాలను విజయవంతంగా ఎదుర్కొన్న సింధు వీరుడు రాజాదాహిర్ కుమార్తెలు, ఆదర్శ మూర్తులయిన రాణి సూర్య, చంద, గుజరాత్ నారీరత్నాలు మెహతా సోదరీమణులు తానా, రిరి, లయొక్క వీరోచిత గాథలను, వీరహకీకత్ రాయ్, ఝాన్సీ లక్ష్మీబాయి, గురు తేగ్ బహదూర్, గురు గోవింద సింగ్, అతని కుమారుల ధైర్యసాహసాలు, త్యాగాలు, బలిదానాలను, పాషాణహృదయుడు, కిరాతకుడు అయిన ఔరంగజేబు దురంతాలకు ప్రాణాలు అర్పించారే తప్ప మతం మార్చుకొనని లక్షలాది హిందూ యువకిశోరాల గురించి మన యువతకు తెలియ చేయాలి. శ్రీకృష్ణుని దివ్యగీతా సందేశాన్ని విస్మరించి, మహమ్మద్ గోరీని వధించకుండ అనేక సార్లు విడచి పెట్టి చివరకు అతని చేతులోనే ప్రాణాలను తన దేశ స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొన్న పృథ్వీరాజ్ చౌహాన్ గురించి, సిక్కులు ప్రతినిత్యం ప్రార్థనా సమయంలోనూ, గురుగ్రంథ సాహెబ్ పారాయణ చేసేసమయంలోనూ సదాస్మరించుకొనే ధర్మం కోసం, దేశం కోసం బలిదానం చేసిన మహావీరుల చరిత్రలను యువతకు తెలియచేయాలి. జయచంద్రుడు, జయసింహుడు వంటి దేశద్రోహుల వివరాలు, వారివలన దేశానికి, ధర్మానికి జరిగిన నష్టముల గురించికూడా చెప్పాలి. వీటితోపాటు మన దేశనాయకులైన గాంధి, నెహ్రూలు తీసుకొన్న చారిత్రాత్మక నిర్ణయాలను, వారి వ్యవహార కుశలతను, వీరులు, దేశభక్తులూ అయిన నేతాజీ సుభాష్ చంద్రబోస్, సర్దార్ పటేల్ వంటి వారి సాహసోపేతమైన చర్యలను తులనాత్మకంగా వివరించి చెప్పాలి.

(-' ఇండియాపోస్టు' సౌజన్యంతో-)

అనువాదం శ్రీ పి. భద్రాద్రి శ్రీరామచంద్రమూర్తి. విజయవాడ.

## మన ఆలయాలు **కపోతేశ్వర క్షేత్రము- చేజర్ల.**

''దక్షిణ కాశి''

గుంటూరు జిల్లా నరసరావుపేటకు 16 మైళ్ళుదూరంలో 'చేజర్ల' చిన్న గ్రామం.

ఆ గ్రామంలో 'దక్షిణకాశి'యని ప్రఖ్యాతి గాంచిన కపోతేశ్వర దేవాలయం చాలా పురాతనమైనది. బుద్ధుని జాతక కథలలోగల 'శిబి' జాతక కథకు దీనికి సంబంధమున్నట్లు చరిత్రకారుల అభిప్రాయం.

క్రీ.శ. 3వ శతాబ్దికి పూర్వమే యీ దేవాలయము కట్టబడినట్లు, చేజర్ల చరిత్ర ప్రసిద్ధమగునగరమని చాళుక్యరాజు కుబ్జవిష్ణువర్ధనుడు యీ దుర్గమును పాలించినట్లు 'తిమ్మాపుర' శాసనం తెలుపుచున్నది.

శిబి చక్రవర్తి కాశ్మీరము నేలుచున్న కాలంలో ఆయన తమ్ములు మేఘాడంబరుడు, జీమూత వాహనుడు తీర్థయాత్రలకై దక్షిణ భారతదేశంలో గల చేరుంజర్ల పర్వత గుహలందు తపస్సు చేసి దేహత్యాగం చేసి లింగా కారులై వెలసిరని తెలిసి శిబి తన కోటి పరివారంతో చేరుంజర్ల (చేజర్ల) కు విచ్చేసి శతయజ్ఞదీక్షా పరుడైనాడట.

త్రిమూర్తులతని దానశీలత్వమును పరీక్షింప నెంచి బ్రహ్మ బాణముగను, శివుడు కిరాతుడుగను, విష్ణువు పావురముగ మారిరట – డేగ, పావురములని మరి కొందరభిప్రాయము. – పావురము శిబినిశరణువేడెను.

ఏమైననూ కిరాతుడు పక్షి (పావురము) నిమ్మని శిబినడుగగా దాని యెత్తు మాంసం తన దేహంనుండి యిచ్చెదను గాని పావురము నివ్వనిరాకరించెను.

ఎంత మాంసము తన నుండి కోసి యిచ్చిననూ పావురము సరితూగలేదు. శిబితన తలలోని మెదడుసైతము తీయబోవు సమయంలో త్రిమూర్తులు ప్రత్యక్షమైరి.

త్రిమూర్తుల వరఫలంగా శిబి శివైక్యముకాగా తన కోటి పరివారం కోటిలింగాలై వెలసినవి.

అలా కపోతమును రక్షించిన శిబి లింగాకృతి దాల్చి ధన్యుడైనందున ఆ లింగానికి! కపోతేశ్వర లింగమని పేరు వచ్చింది.

అదే 'దక్షిణకాశి' – అదే కపోతేశ్వరక్షేత్రము – చేజర్ల.

(భాస్కరుని వేంకటలక్ష్మి నారాయణ ప్రసాదరావు, చేజర్ల, గారు సంకలనం చేసిన చేజర్ల స్థలపురాణం నుండి. – సం.)

---

## మీకు తెలుసా ?

సాధారణంగా మనలో చాలామందికి భగవద్గీతను 'గీత' అంటారని మాత్రమే తెలుసు. కానీ భగవద్గీతకు మొత్తం 18 ఇతర నామాలున్నాయని మీకు తెలుసా? అవి 1. గీత 2. గంగ 3. గాయత్రి 4. సీత 5. సత్య 6. సరస్వతి 7. బ్రహ్మవిద్య 8. బ్రహ్మవల్లి 9. త్రిసంధ్య 10. ముక్తగేహిని 11. అర్ధమాత్ర 12. చిదానంద 13. భవఘ్ని 14. భ్రాంతినాశిని 15. వేదత్రయ 16. పర 17. అనంత 18. తత్వార్థజ్ఞాన మంజరి.

–షేక్ ముజీర్‌భాషా – హనుమంతునిపాడు.

సేకరణ – చే రెడ్డి శ్రీరామ్ రెడ్డి

ధర్మసంసద్

# కృష్ణజన్మస్థాన విముక్తి

విశ్వహిందుపరిషత్ భాగమైన ధర్మసంసద్ నవంబరు 16-17 తేదీలలో ఢిల్లీలో అనేక వందల మంది సాధువులతో ఒక సమావేశము జరిపి మధురలోని శ్రీకృష్ణ జన్మస్థానమును విముక్తి చేయువిషయమై ఒక ఏకగ్రీవ తీర్మానమును ఆమోదించింది. రానున్న సంవత్సరంలో జరిగే సమ్మేళనంలో అందరు హిందువులు పాల్గొనాలని పవిత్ర జన్మస్థలాన్ని విడుదలకు కృషిచేయాలని పిలుపునిచ్చారు. కేంద్ర ప్రభుత్వం దేవాలయం చుట్టూ నిర్మించిన అడ్డంకులన్ని తొలగించాలని కోరారు.

అంతేకాక దేశం అంతటా సాధువుల ఆధ్వర్యంలో జరిగే ప్రచారంలో కృష్ణజన్మస్థాన విముక్తి విస్తృత ప్రచారం జరుగాలనే విషయం పై కూడ తీర్మానించారు.

విశ్వహిందు పరిషత్ సెక్రటరీ జనరల్ ఆచార్య గిరిరాజ్ కిషోర్‌గారి ప్రకారము వచ్చే మార్చి 10న ప్రారంభం జరిగే ప్రచారంలో మూడు ముఖ్యవిషయాలు ప్రాముఖ్యం వహిస్తాయి.

1. కృష్ణజన్మస్థానములో ద్వారాకాధీశుని ఆలయనిర్మాణానికి ఆస్థలం అప్పగింత
2. అచ్చటినుండి పోలీసు బలగాన్ని తొలగించుట
3. ఈద్ (పండుగ) సందర్భంలో ఒకసారి జరగాల్సిన నమాజు ఇప్పుడు ఐదు మార్లు జరుగుతుంది. అట్టిచోట రెండుమార్లు మాత్రమే నమాజు అనుమతించుట.

ద్వారకాధీశుని దేవాలయము వద్ద భక్తులను ఇబ్బందులకు గురిచేయడం తగదని ప్రభుత్వమునకు, పోలీసు మరియు ఇతర అధికార్లకు వేరొక తీర్మానం ద్వారా తీవ్రంగా తెలుపడమైనది. శ్రీకృష్ణ కథా కుంజ్ నిర్మాణం కోసం కృష్ణజన్మస్థానం వద్ద ఖాళీగావున్న వంద (100) ఎకరాల స్థలాన్ని వెంటనే అప్పగించాలని కోరడం అయినది. ముస్లిం మత ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని, మధుర, కాశీ మరియు అయోధ్య దేవాలయాలు హిందువులకు అప్పగించాలని తీర్మానంలో పేర్కొన్నారు. 1947కు పూర్వం వున్న స్థితి ప్రకారం అయోధ్యకాక - మధుర మరియు కాశీ పూజాస్థలాలు తిరిగి అప్పగించాలని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని కోరడమైనది.

ధర్మసంసద్ ఏకగ్రీవంగా, సామాజికసఖ్యత, స్వదేశీ జాగరణ, గోరక్షణ, సాంస్కృతిక కల్మషం కల్గిస్తున్న ప్రచార సాధనాలపై మరియు మత మార్పిడీలపై నియంత్రణ, దళిత క్రిష్టియన్లకోసం వున్న రిజర్వేషన్ల వ్యతిరేకత మొదలగునవి 18 తీర్మానములు ఆమోదించింది.

టెహ్రీరాన్ నిర్మాణాన్ని ఆపాలని విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ప్రయోజనాలకు గంగానది ఉపనదులకు డ్యాంలు నిర్మించవచ్చని, కావలసిన చర్యలు తీసుకోమని యునైటెడ్ ఫ్రంటు ప్రభుత్వాన్ని కోరుతూ వేరొక తీర్మానం కూడ చేయడమైనది.

వచ్చే మార్చి ఏప్రిల్ లో జరిగే గంగాయాత్రలో (గంగో త్రి నుండి గంగా సాగర్ వరకు) తెహరీ డ్యాం నిర్మాణం వల్ల జరిగే అనర్థాలను అందరి దృష్టికి తీసుకురావడం జరుగుతుంది. గంగా పరివాహ ప్రదేశాలు హరిద్వార్, ప్రయాగ, ఋషికేష్. ఫిబ్రవరి 8న ప్రయాగలో యాత్రకు ముందు జరిగే బహిరంగ సభలో సుమారు ఒక లక్షమంది సాధువులు పాల్గొంటారు.

అన్నార్తులకై వారి బాధలు నివారించేందుకు ధర్మసంసద్ వారు అన్నదానానికి గల ప్రాముఖ్యమును వివరిస్తూ విరివిగా అన్నదానం చేయాలని కోరారు. టిబెట్టు గురించి కూడ వేరొక తీర్మానం ఆమోదించినారు. ప్రపంచంలో టిబెట్టుకు అహింస మరియు శాంతియుత స్థానాన్ని ఇవ్వాలని కోరారు. చైనా సైనిక స్థావరాలను టిబెట్టు నుండి తొలగించాలని వాటితోపాటు ఆయుధప్రయోగశాలలు, సైన్స్ అకాడమిలను కూడ తొలగించాలని కోరారు. టిబెట్టు భాషా సాంస్కృతిక స్వరూపాన్ని చైనా పాడుచేయవద్దని కోరారు.

మానస సరోవర యాత్రకు విమాన సర్వీసు ఏర్పాటు గురించి కూడ ధర్మసంసద్ ప్రత్యేకంగా పేర్కొంది.

తీర్మాన ప్రతిపాదనలలో మొదటిగా, ధర్మసంసద్, హర్యానా వద్ద ఆకాశంలో డీకొన్న రెండువిమాన ప్రమాదాలలో ప్రయాణించిన యాత్రికులకు, ఆంధ్రప్రదేశ్‌లోని తుఫాను బాధితులకు శ్రద్ధాంజలి ఘటించింది.

ధర్మసంసద్‌నుద్దేశించి, అశోక్‌సింఘాల్ గారు సాధువులు సమాజంలోని దిగజారిన నైతిక, ధార్మిక విలువలను పునరుద్ధరించాలని కోరారు. శ్రీ కృష్ణజన్మస్థానాన్ని హిందువులకు తిరిగి అప్పగించాలని దానికి వున్న అడ్డాలన్నీ తొలగించాలని ప్రభుత్వాన్ని తీవ్రంగా నిరశించారు.

రాష్ట్రీయ స్వయం సేవక్ ప్రతినిధి శ్రీ కె. యస్. సుదర్శన్, స్వదేశి మరియు సాంఘిక సంఘటిక శక్తి గురించి నొక్కి చెప్పి ''అమెరికా'' అమెరికన్లగా వుండండి. అమెరికా తయారీ వస్తువులే కొనండి అని అంటుంది. అలాగే ఇండియా కూడ అట్లా ఎందుకు చెప్పదు? ఆ పద్ధతి ఎందుకు అవలంబించకూడదు అని అడిగారు.

జ్యోతిష్‌పీఠ్ శంకరాచార్యస్వామి వాసుదేవానంద సరస్వతి, రామానందాచార్య శ్రీ రాంభద్రాచార్య గారు చిత్రకూట్‌నుండి, బౌద్ధ భిక్షు భంటే జ్ఞాన్ జగత్ గారు, ప్రొఫెసర్ రిన్‌పోంచెగారు, మహంత అవేద్యనాథ్‌గారు ఆచార్య గిరిరాజ్‌కిషోర్ గారు కూడా సభను సంబోధించారు. ఈ సభలో హాజరైన ఇతర ప్రముఖ సాధువులు స్వామి సత్యమిత్రానంద గిరి, స్వామి చిన్మయానందగారు, భోలానాథ్‌గారు, భక్తహరిగారు మరియు సంతోషి మాతా, సీతారాం, ఉమేష్ యుని, సంత విజయ, కౌషల్ మరి ఇతరులు. నవంబర్ 15న ఈసభకు ముందు వి.హెచ్.పీ యొక్క కేంద్ర మార్గదర్శక మండల సమావేశం జరిగింది.

(ధర్మసంసద్) అనువాదం – ప్రమోద్ వళ్‌సంగ్‌కర్.

---

## వార్త :

తుఫానుబాధితుల సహాయార్థం ఇటీవల ప్రకాశం జిల్లా తుఫాను భీభత్సతంతో అతలాకుతలమైన విషయం విదితం. కందుకూరు పరిసరగ్రామాల బాధితులకు ధనరూపేణా, వస్తురూపేణా సహాయం అందించవలసిందిగా మల్లి కార్జునశర్మ

(వి. హిం. ప. జిల్లా సహకార్యదర్శి) విజ్ఞప్తి చేస్తున్నారు.

మాతృమందిరం

# ఆది నుండి ఆధునికం వరకూ స్త్రీ-

-డి.జి. విజయలక్ష్మి

ఈ దేశలక్ష్మి ఇక్కడి పురుషులకు వీరత్వము, బ్రహ్మతేజము. సాధుత్వం, మేధస్సు నిచ్చుచున్నదని అర్థవంతమైన మంత్రాలు చెప్పింది. ఋగ్వేద దశమ మండలములో 136 సూక్తంలో గోధా అనే ఋషిక పల్కిన మంత్రం అచంచలమైన భక్తిని వెల్లడించుచున్నది.

న కిర్దేవా మినీమసి, నకిరాయోపయామసి

మంత్ర శ్రుత్యం చరామసి,

పక్షే భిరపి కక్షేభిరత్రాభి సంరభామహే॥

ఓ దేవతలారా! మేము ఎప్పుడూ నీకు ఆగ్రహం కల్గించము శాస్త్ర విహితంగా నడుచుకుంటాము. మిమ్మల్ని అంటిపెట్టుకుని, మీ ప్రక్కన వుంటూ, మీ చేతుల క్రింద ఆశ్రయం పొందుతామని మంత్రార్థం.

శ్రద్ధా కామయనీ అనే ఋషిక శ్రద్ధ గురించి 154 సూక్తంలో 5 మంత్రాల్ని దర్శించింది. అందులో ప్రియం శ్రద్ధే దదతః, ప్రియం శ్రద్ధేదిదాసతః ఇత్యాది మంత్రమునకు - ఓ శ్రద్ధా! దానం చేసే వాణ్ణి ఆశీర్వదించు

ఓ శ్రద్ధా దానం చేయదల్చిన వాణ్ణి ఆశీర్వదించు

ఉదారంగా ఆరాధించే వాణ్ణి ఆశీర్వదించు

నే పల్కిన పల్కును ఆశీర్వదించు అని అర్థం. ఎంత ఉదాత్త భావన! సర్వజన శ్రేయోదాయకమైన వేడికోలు! స్త్రీలు అసూయాపరులు అని ఆరోపించే అల్పులు అవనతులై అభివాదం చేయదగిన అద్భుత మంత్రాలకు అతివలు స్రష్టలుగా వుంటే ఇక స్త్రీకి వేదార్హత లేకపోవటమేమిటి ? స్త్రీని తమ చెప్పుచేతల్లో పెట్టుకోవాలనే దుర్బుద్ధితో మధ్యకాలంలో ఏర్పరిచిన నియమాలే మగువల పాలిట శాపాలై ఆత్మన్యూనతకు దోహదమిచ్చాయి కాని ఏ వేదంలోనూ, శాస్త్రంలోనూకూడ స్త్రీ పురుషునికంటే తక్కువగా చెప్పబడలేదు. కేవలం స్త్రీల గొప్పదనమును, వారి ఓజస్సు, తేజస్సు, గురించి మంత్రములు చెప్పిన స్త్రీలు, శచిపౌలోమి, అంగీరస, సావర్జ్ఞ, ఇంద్రాణి, మొదలగు ఋషికలు, స్త్రీల విద్య, వివాహాది సంస్కార విషయాల గురించి సూర్యా సవిత్రీ, లోపాముద్ర మొ॥వారు చెప్పిన మంత్రము లెన్నోవేద విహితములు.

అంతేకాదు ఈనాడు స్త్రీ అమ్మ కడుపులో నున్నప్పటి నుండి తక్కువగా భావించ బడుతోంది. వధువుగా మారిన ప్రతి స్త్రీ పుత్ర సంతతినపేక్షిస్తుంది కాని తన ప్రతి రూపంగా పుత్రిక కావాలని కలలో కూడ తలంచదు. పుట్టిన బిడ్డలనిద్దరిని సమదృష్టితో పెంచదు. కాని వేదకాలంలో పుత్రికలను కించపర్చినట్లు,పురుషునికంటే తక్కువగా భావించినట్లు కనబడదు. పుత్ర సంతతికి ప్రాధాన్యత నిచ్చినట్లు కొన్ని మంత్రాలున్నా ''పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతం'' అన్న మంత్రమునకు పుత్రులు గల మీరు కుమార్తెలు గలవారై పూర్ణా యుర్దాయమును పొందుడు అని అర్థము. కనుక పుత్రికలను కూడ కోరేవారానాడు.

ఇక బాల్య వివాహాలు పూర్వకాలంలో వుండేవని, తర్వాత కాలంలో స్త్రీ జనోద్ధరణ జరిగిందని

మనం చరిత్రలో చదువుకున్నాం. కాని వేదకాలంలో స్త్రీ స్వయం సిద్ధ వ్యక్తురాలయాక కోరిన వరుని వివాహ మాడే స్వేచ్ఛ గలదని కొన్ని మంత్రాల వల్ల స్పష్ట మౌతుంది.

'స్తోమం జుషేథాం యువశేవ కన్యనాం'' ఇత్యాది ఋగ్వేదం 8వ మండలం 35వ సూక్తములో 5వ మంత్రమునకు – ఓ అశ్వనీ దేవతలార! యువకులు కన్యల ఆహ్వానమును స్వీకరించునట్లు మీరీ స్తోత్రమును స్వీకరించుడు అని భావం. ఇక్కడ యువకులను కన్యలు ఆహ్వానించుట. వ్యక్తురాలైనపుడు కన్య అనబడును. బాలికలకు స్వయముగా భర్త నెన్నుకొనులోక జ్ఞానముండదు. కనుక యౌవ్వనవతులు స్వయం వరములో భర్తలనెన్నుకొనెడి వారనుట సత్యము, సమంజసము.

ఇంకనూ గమనించిన

సూర్యాం యత్పత్యై శంసంతీం మనసా సవితాదదాతు (ఋ.స.10మండలం.85వ సూక్తం 27 మంత్రం)

సూర్యుడు పతిని కోరుచున్న సూర్యను మనః పూర్వకముగా సోముని కిచ్చెనని మంత్రార్థము. స్వయముగా వధువు కోరిక ననుసరించి వివాహము చేయుటక్కడ గమన్నార్హము. అంతియేగాక భర్తృ గృహమునకు వెళ్ళునపుడు చెప్పిన ఋక్కులు కొన్ని యువతుల నుద్దేశించియే చెప్పినట్లు తోచును.

గృహాన్గచ్ఛ గృహపత్నీ యథాసో వశినీత్వం వదథీ మావదాసి.''

(ఋ. సం॥ 10మండలం. 85 సం. 26 మంత్రం)

నీవు భర్తృ గృహమునకు వెళ్లుము గృహిణివై గృహమందున్న వాటినన్నింటిని వశమందుంచుకొను దానవై భృత్యాది జనము నా జ్ఞాపించుచుండుము అని మంత్రార్థము.

భర్తయింటికి వెళ్లి గృహమును సంస్కరించుట, అన్నింటిని వశమందుంచుకొనుట, అధికారముతో సేవకుల నాజ్ఞాపించుటకు సమర్థురాలగు వధువెంత వయస్సు కల్గియుండునో మనమూ హించలేమా? బాల్యము వీడనిదే ఇన్ని పనులు చక్క బెట్టుకొన లేదు కదా? దీనిని బట్టి కూడ బాల్య వివాహాలు లేవనేది సుస్పష్టం.

పైగా స్వయంగా వధువు తనకు నచ్చిన వారిని వరించి వివాహం చేసుకునేదని, స్వయం వర వివాహాలానాడు సాధారణమని తెల్పే మంత్రాలు చాల వున్నాయి.

భద్రా వధూర్భవతి యత్సుపేశాః స్వయం సామిత్రం వృణుతే జనే చిత్ (ఋ.సం. 9వ మండలం – 27వ సూక్తం – 12 వ మంత్రం) కల్యాణియు, శోభనరూపయు అగుస్త్రీ జనమధ్యనున్న వరుని స్వయముగా కోరుకొనుచున్నదని భావం.

కన్య సంపూర్ణ స్వాతంత్రంతో తల్లిదండ్రులు అనుమతితో తనకు నచ్చిన వరుని భర్తగా గ్రహించు ఆచారమానాడు వుండేదన్న మాట. తండ్రులే స్వయంవరమేర్పాటు చేసి వరులను ఆహ్వానిస్తే వధువు తనకు నచ్చిన వరునికి మాలవేసి వరించేది. లేదా తనుకోరుకున్న వరుణ్ణి తల్లి దండ్రుల అనుమతితో వివాహమాడేది. మరి ఈ నాడు వరుడు ఎట్లున్నా ఫరవాలేదు. తండ్రి ఇవ్వగల కట్నాన్నంగీకరించేవాడైతే చాలని సరిపెట్టుకునే స్థాయిలో వుంది స్త్రీకి అసలానాడు వరకట్నాల ప్రసక్తేలేదు.

(సశేషం)

ఆంధ్రవీరులు

# ఆంధ్రకేసరి

(గత సంచిక తరువాయి - 4)

రాష్ట్రకవి
- డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

ఆనాటి రాతిరి యచ్చోట నాడిరి, తిరుపతి వేంకటద్వితీయ కవుల
పాండవోద్యోగంబు పాండవ విజయంబు, నాగనొప్పెడు నట్టి నాటకంబు
పీసపాటి యనంగ పెద్ద పేర్నటుడహో!, శ్రీకృష్ణ పాత్రకు జీవమిడెను
పింగళి, కాటూరి, వేటూరి, వేలూరి, విశ్వనాథాదులు విడిసిరచట
చెళ్ళ పిళ్ళ విభుడు చేరికూర్చుండెను, ఆంధ్రకేసరి యటనధివసించె
చిన్ననాటి తనదు చెన్నుమీరిన యట్టి. నాట్యరంగ కథలు నాట్యమాడ .
చదువులోవరు ఫోర్తులో జరుగునపుడు, వచ్చెమార్పది జీవిత పథమునందు
ప్రారంభించెను నాటక ప్రకరణంబు, తలచినంతనె తడిదేఱు తలపుల హహ!
పూనాకంపెని ఫేరిట, ఓనాటక సంస్థ వచ్చి ఒంగోల్నందున్
మానుగ హిందీ భాషలో, మానితనాటకములాడె మరువనిరీతిన్
అలప్రమీలాస్వయంవరమనగనొకటి, యటనుషా పరిణయమన్న దవల నొకటి
పీష్వనారాయణాఖ్యుని భీష్మవధయు, కీచకవధాది నాటక క్రీడలయ్యె.
ఆనాటకంబులు యాతనిహృదిలోన, హత్తుకొనియెనొటనతడు గూడ
గురువు యిమ్మానేని కులమణి హనుమంత రావు నాయుడు గారి ప్రాపు దొరుక
ఉండదల్లీసాహో బురవగు తోడుతో, కుఱ్ఱనటుల తానుకూర్చుకొనుచు
అల్లాంటి నాటకాలాడనారంభించి, చొక్కంపుకీర్తిని చూరగొనియె
ఆడవేషంబు లందుననధికుడయ్యె, పీష్వనారాయణారావు భీష్మవధలో
తానె నారాయణుని పాత్రధారి యగుచు, గొప్పకీర్తిని గడియించెకువలయమున
మిడిలు పరీక్షను దాటెను, వడివడి మెట్రిక్పరీక్ష పఠియించుటకై
నడచెను నాయుడి గారితో, యడుగిడెమఱి రాజమండ్రి యందుననంతన్
రాజమహేంద్రవరంబునందున గూడ, నాటకంబులగోలనడచుచుండె
గురువు యిమ్మానేని కుడిభుజమనదగు, పిళ్ళారి సెట్టితావెనుకనిలువ
అమలాపురంబున నలకాకినాడాది పట్టణంబులఁగూడప్రతి భమీఱె
చిలకమర్తి కవుల శ్రీగయోపాఖ్యాన, నాటకంబది మహానాటకంబు
అందుతొలుతగయుని యర్ధాంగలక్ష్మియౌ, చిత్రరేఖ పాత్రస్వీకరించి
అవలనర్జునుడుగనవతరించుచుతానె, గొప్పనటుడుగాగ గుప్పుమనియె.
చిలకమర్తి వారిచేతినాటకములె, నాడు తాము తఱచు నాడిరచట
వారు తమదు కొఱకె వ్రాసితిరన్నచో, నతిశయోక్తి కాదు; యగును నిజము.
మున్నుకాంగ్రెసుకధ్యక్షుడన్నఘనుడు, శ్రీపనప్పాకమానందశేముషుండు
శ్రీప్రకాశమునభినయశ్రీని యరసి, మెచ్చి బహుమతి యేదియోయిచ్చెనహహ!
నాటకముల వల్ల నటులకు మఱియును, ప్రేక్షకులకు దేశ ప్రేమపెరుగు
కాని నీతి పథము కాపాడు కొనుడన్న, కేసరికిదెమనదు కేలు మోడ్పు.

(సశేషం)

# యువతా సమ్మేళనం

పశ్చిమ ఆంధ్రప్రాంత యువతాసమ్మేళనం డిశంబర్, 14,15తేదీలలో సాందీపని విద్యాలయం (హైద్రాబాదు)లో జరిగింది. 300లకు పైగా యువకులు పాల్గొన్నారు.

విశ్వహిందూపరిషత్ కేంద్రీయ ఉపాధ్యక్షులు ఆచార్య బి.రామరాజు గారు తమ ఉద్ఘాటనా ప్రసంగంలో ''భారత సమగ్ర స్వరూపాన్ని విచ్ఛిన్నం చేయడానికి అనేక అనైతికశక్తులు సాంస్కృతికదాడులు జరుపుతున్నందున వారినెదిరించి ధర్మసంస్థాపనకై యువతరం నడుం బిగించా''లన్నారు.

తర్వాత వీరసావర్కార్ 'అండమాన్లో ఆజన్మాంతం' అన్న గ్రంధం ఆవిష్కరింపబడ్డది. తెలుగు సేత డా॥కసిరెడ్డి యువతకు గ్రంధ పరిచయం చేశారు.

అనంతర కాలంలో ప్రముఖ గ్రంధ కర్త మన్నవ గిరిధర రావుగారు 'దేశం ఎటుబోతున్నదో-మన కర్తవ్యమేమిటో' అన్న విషయాన్ని అనేక ఉదాహరణలతో వివరించారు.

మూడవ సమావేశంలో RSSసహసర్కార్యవాహ శ్రీమద్యన్‌దాస్‌జీ ప్రసంగిస్తూ''భారత సరిహద్దుసమస్యలు, కాశ్మీర్ సమస్య, సరిహద్దు దేశాల నుండి అక్రమ చొరబాటుదార్లు, దేశ ఆర్ధిక దాస్యం, రామజన్మభూమి, నక్సల్స్ మొదలైన అనేక సమస్యలు – వాటి పరిష్కారానికి బజరంగ్‌దళ్ ఆవశ్యకత, భారత్‌లో పుట్టిన యువత అంకితం కావాలని అన్నారు.

బజరంగదళ్ జాతీయ అధ్యక్షులు శ్రీ జయబాన్ సింగ్ పవయ్యా సమ్మేళనంలో పాల్గొని బజరంగ్‌దళ్ భవిష్యకార్యాచరణ వివరిస్తూ ''గోహత్య నిరోధించడానికి ప్రతి గ్రామంలోని యువకులునడుంబిగించాలని, వివేకానంద స్వామికన్న కలలు వాస్తవం చేయాలని, కుహనా సెక్యులర్ విధానంతో దేశం విచ్ఛిన్నం కాకుండా చూడాలనీ, మధురలోని శ్రీకృష్ణజన్మభూమిలో అనధికార కబ్జాను నిరోధించడానికై మార్చి 10 నుండి 16 వరకూ వేలాది సాధు సంతులు బ్రిజ్‌యాత్ర నిర్వహిస్తున్నారని, దేశవ్యాప్తంగా హిందూయువతను సమీకరించి దేశ విచ్ఛిన్నకర కార్యాలను ఎదుర్కోనున్నా''మని అన్నారు. ఈ రెండు రోజుల సమ్మేళనంలో స్వాగత సమితి అధ్యక్షులు, శ్రీ కె.ఇ. ప్రసాద్, కార్యాధ్యక్షులు శ్రీ ఎమ్.ఎస్. ఆనందరావు, కార్యదర్శి శ్రీ శివప్రసాద్, శ్రీ మోహనరావు, వి.హిం.ప.అధ్యక్షులు శ్రీ జి. పుల్లారెడ్డి, కార్యాధ్యక్షులు శ్రీ M.V.R. శర్మ, శ్రీ గుండేరావు, శ్రీ సుబ్రహ్మణ్యం ప్రభృతులు మార్గదర్శనం చేశారు.

---

# ముస్లిమ్మాటికి ఉమ్మడి సివిల్ కోడ్ ఉండి తీరాలి

జాతీయసమైక్యతకు, సమగ్రతకు ఉమ్మడిసివిల్‌కోడ్ రూపొందాలని జాతీయ మానవహక్కుల సంఘం మాజీ అధ్యక్షుడు, భారతమాజీ ప్రధాన న్యాయమూర్తి **రంగనాధ మిశ్రా** గట్టిగా అభిప్రాయపడ్డారు. ఉమ్మడి సివిల్‌కోడ్ లేనందువలన మనం ఒకే జాతి అని భావించలేక పోయామని. అందువలన దేశ సమైక్యతా భావానికి ప్రమాదం ఏర్పడుతోందని ఆయన అన్నారు. ఉమ్మడి పౌరశిక్షాస్మృతి వుండాలని లక్ష్యంగా రాజ్యాంగం నిర్దేశించిందని కానీ, ఆలక్ష్యం ఇంతవరకు నెరవేరలేదన్నారు.

## చరిత్ర | వనవాసి కార్యకర్త దేశభక్తి

పశ్చిమ బెంగాల్లో సరిహద్దు ప్రాంత వనవాసి గ్రామం చక్రంప్రసాద్. ఆ గ్రామంలోని 15సం॥ వనవాసి కార్యకర్త చర్మ్యాముర్మ్ము ఉండేవాడు.

1971లో తూర్పు పాకిస్థాన్‌లోని ప్రజలు స్వతంత్ర బంగ్లాకై పోరాటం సాగిస్తున్న కాలమది.

ఆ సమయంలో మన భారతసైన్యం బంగ్లా స్వతంత్ర ఉద్యమకారులకు మద్దతుయిచ్చారు.

ఆ 1971 ఆగష్టు 18న పాకిస్థాన్ ఖాన్‌సేన చక్రం ప్రసాద్ వనవాసి గ్రామంలోకి జారబడటం గమనించిన చర్మ్యాముర్మ్ము భారత సైనికులకు ఆ విషయాన్ని తెలియజేశాడు. ఆగస్తీ కేంద్రంలో ఆసమయంలో భారత సైనికులు ఇద్దరూ మాత్రమే ఉన్నారు. వారిదగ్గర మందుగుండు సామాగ్రిపెట్టె ఉన్నది.

ఆ పెట్టె ఆబాలుడు మోసికొనిపోగా సైనికులు ఇద్దరూ ఖాన్ సేననెదిరించారు. ఇది గమనించిన ఖాన్ సేన ఆ బాలునిపై తుపాకులు పేల్చారు. ఇద్దరు సైనికులు ఖాన్ సేనను నిలువరించలేని స్థితిని గమనించిన 15సం॥ వనవాసి బాలుడు తన నెత్తిపైనున్న మందుగుండు సామాగ్రి, ఖాన్‌సేన హస్త గతం కాకుండా వుండటానికై, తన ప్రాణాపాయస్థితిని లెక్కచేయకుండా పెట్టెతో ప్రక్కనే యున్న పెద్ద చెరువులో దూకి త్యాగం చేసి చివరకు బంగ్లా స్వతంత్రం కావాడానికి తోడ్పడి, దేశభక్తిని ప్రకటించాడు. ఆబాలుడు నేటి యువతకు ఆదర్శమూర్తి.

పచ్చిమబెంగాల్ పర్యటనలో గమనించిన సంఘటన, అని వి.హిం.ప. దక్షిణాచల సహసంఘటనా కార్యదర్శి ప. ఆంధ్ర యువతా సమ్మేళనం (14.12.96)లో వివరించారు.

## నవవిధులు

(వి.హిం.ప. పూర్తిసమయకార్యకర్తలకు-కార్యక్రమ నియమావళి-ద.అంచల సహసంఘటనాకార్యదర్శి శ్రీ వై.రాఘవులు)

1.హితచింతకుల (రు.12/-) నమోదు చేయుట, 2. స్థానీయ సమితులు నిర్మాణము చేయుట, 3. ప్రతి ఉపఖండలో 'సత్సంగ' నిర్వహణ, 4. ఆజీవన హితచింతకుల నమోదు. (2000/-;10000/-; లక్ష.), 5. 'విశ్వహిందు' మాసపత్రికకు చందాదారుల సేకరణ. 6.ప్రముఖవ్యక్తులతో సంపర్కము. 7.వానప్రస్థీ కార్యకర్తల నియామకం. 8. సమయ దానం చేయు కార్యకర్తల నెన్నుకొనుట. 9. స్థానీయ అవసరాలకనుగుణంగా వార్షిక కార్యక్రమ యోజన, తయారు. (కృష్ణాష్టమి, హనుమజ్జయంతి; మొ॥)

---

**విజయోత్సవం :** 6.12.1996న బజరంగదళ్ కార్యకర్తలు భాగ్యనగర్ బేగంబజారులో అయోధ్యలో బాబ్రీ అక్రమకట్టడం తొలగించి రామమందిర నిర్మాణ నాంది విజయోత్సవం జరిపారు. షు॥ 100 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

అందరికీ స్వీట్లు పంచడం జరిగింది. అలాగే కర్నూలు పట్టణంలోనూ విజయోత్సవం నిర్వహించబడ్డది. – డి. వాసుదేవ్

# దుర్గావాహిని అఖిల భారతీయ శిక్షిక ప్రశిక్షణ వర్గ

దుర్గావాహిని అఖిల భారతీయ శిక్షిక ప్రశిక్షణ వర్గ గుజరాత్ ప్రాంతంలో బరోడా వద్దనున్న స్వామీ నారాయణ దేవాలయం అయిన హరిధామ్‌లో **20-11-96** నుండి **1.12.96** వరకు ఉత్సాహపూరితంగా జరిగినది. ఈ వర్గలో దుర్గావాహిని అఖిల భారతీయ సంయోజిక సాధ్వి ఋతంబర జీ, విశ్వహిందూ పరిషత్ అంతర్జాతీయ సెక్రటరీ జనరల్ శ్రీ ఆచార్య గిరిరాజ్ కిశోర్‌జీ, సంయుక్త ప్రధాన కార్యదర్శులు శ్రీ సదానంద జీ కాకడే, శ్రీ ఓంకార జీ ఖావే, హరిదామ్‌కు చెందిన సాధ్వీ వ్రేదుజీ, సాధ్య సర్వేశ్వరీ జీ మొదలయిన దుర్గావాహిని, విశ్వహిందూ పరిషత్ అఖిల భారతీయ అధికారులు మార్గదర్శనము చేశారు.

ఈ వర్గలో రాజస్థాన్ నుండి పదముగ్గురు, మధ్య భారత్ నుండి ఆరుగురు, గుజరాత్ నుండి తొమ్మిది మంది, హిమాచల్ ప్రదేశ్ నుండి ఇద్దరు, జమ్ముకాశ్మీర్ నుండి ఒకరు, మహారాష్ట్ర నుండి పదిమంది, పూర్వ ఆంధ్ర నుండి ఇద్దరు, మొత్తము **43**మంది, దుర్గావాహిని కార్యకర్తలు శిక్షణ పొందారు. వర్గలో ప్రతిదినం ఉదయం **5.45** నుండి రాత్రి పదిగంటల వరకు వివిధ కార్యక్రమముల ద్వారా శిక్షణ ఇవ్వబడినది. ఉదయం ఏకాత్మతా స్తోత్రం, ఏకాత్మతా మంత్రం, గాయత్రీ మంత్ర పారాయణ, ఓంకార ఉచ్చారణలతో కార్యక్రమాలు ప్రారంభం అయ్యేవి. ఉదయం రెండున్నర గంటలు, సాయంత్రం రెండు గంటలు శారీరక శిక్షణలో నియుద్ధ (కరాటే) యోగాసన, దంటే (కర్రసాము) తాడుపైకి ఎగబ్రాకటము (Rope Climbing)కష్ట సహిష్ణుత (Obstacle training)లక్ష్య భేధన (Aiming)సమత, పదవిన్యాస, ఆటలలో శిక్షణ ఉండేవి. శారీరక శిక్షణ కాక చర్చ కాలాంశంలో వివిధ విషయాలపై చర్చ, భౌద్ధిక్ కాలాంశంలో వివిధ అంశములపై పెద్దల ప్రసంగాలు వుండేవి. మధ్యాహ్న సమయంలో కోలాటం, ముగ్గులు, పత్రికా రచనలో శిక్షణ, వేణు వాదనము, తబలా మొదలయిన విషయములలో తమకభిరుచియైన ఏదో ఒక విషయాన్ని ప్రతి శిక్షార్థికి వెచ్చిక విషయములో శిక్షణ ఇవ్వబడెను. చర్చలు, భౌద్ధిక్‌లలో దుర్గావాహిని ఆశయ ఆదర్శాలు, కార్యక్రమాలు, దుర్గావాహిని కార్యకర్తల మానసిక సంసిద్ధత, మాతృశక్తి మహత్యము సమాజంలో మహిళ ఎదుర్కొంటున్న సమస్యలు. కార్యకర్త లక్షణాలు దేశ భవిష్యత్తును తీర్చిదిద్దడంలో దుర్గావాహిని పాత్ర, గోసంరక్షణకై చేయవలసిన కార్యక్రమాలు, విశ్వహిందూ పరిషత్ యొక్క నిర్మాణాత్మక కార్యక్రమాలు, హిందూ సంఘటన నిర్మాణంలో మెలకువలు, హిందూ సంస్కృతి పునరుజ్జీవనము, ఇస్లాం క్రైస్తవ మత మార్పిడి నుండి హిందువులను కాపాడుకొనడం, మంచి వక్త కావడం ఎలా అనే అంశాలపై చర్చలు, ళప్రసంగాలు జరిగినాయి. రాత్రి కార్యక్రమాలలో ప్రతి శిక్షార్థి తన అవిస్మరణేయ అనుభవములను గురించి వివరించుట, తక్షణ ఉపన్యాసము (ఇచ్చిన అంశముపై అప్పటికప్పుడు మాట్లాడుట) వివిధ ప్రాంతముల వేషధారణ, దేశ భక్తి గేయములు పాడుట మొదలయిన మనోరంజక, విజ్ఞానదాయక కార్యక్రమాలు జరిగేవి.

**1.12.96** సాయంత్రం సమారోప్ కార్యక్రమంలో గత పదిరోజులుగా నేర్చుకొన్న వివిధ విషయములలో శారీరక ప్రదర్శనల తరువాత అఖిల భారతీయ దుర్గావాహిని సంయోజిక సాధ్వీ ఋతంబరజీ ఉత్తేజపూరిత ఉపన్యాసానంతరం శిక్షార్థినులందరికి సాధ్య ఋతంబరజీ, సాధ్వీ ప్రేమజీ, సాధ్వీ సర్వేశ్వరీ జీ, సాధ్వీ సౌరభ్‌జీలు శిక్షార్థినులందరి చేత దుర్గావాహిని సంకల్పం చేయించి ప్రసాద వితరణ చేయడం ద్వారా దీక్షనివ్వడంతో శిక్షణ శిబిరము ముగిసినది.

-కుమారి కల్యాణి

దుర్గావాహిని, విజయవాడ.

# జమ్ము & కాశ్మీరులలో ఆందోళన కలిగిస్తున్న కొంగ్రొత్త పోకడలు

(ఆర్. ఎస్. ఎస్ జనరల్ సెక్రటరీ శ్రీ హెచ్.వి. శేషాద్రితో విశ్వసంవదకేంద్ర సంపాదకులు శ్రీ పద్మాకర్ భట్ ప్రత్యేక ఇంటర్వ్యూ విశేషాలు క్రింద అందిస్తున్నాము -సం.)

గతవారం నాగపూరు వచ్చిన శ్రీ హెచ్.వి. శేషాద్రిగారు ఈ మధ్య జమ్మూ ప్రాంతాన్ని సందర్శించివచ్చిన సందర్భంలో వారితో శ్రీ. పద్మాకర్ భట్ నాగపూర్, ప్రత్యేకంగా సంభాషించినారు. నేషనల్ కాన్ఫరెన్సు నేత డా॥ ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వ నేతృత్వంలో ప్రస్తుతం జమ్మూ కాశ్మీర్‌లో జరుగుతున్న విషయాలపై ప్రత్యేకంగా ఇంటర్వ్యూ కొనసాగింది. శ్రీ శేషాద్రిగారు విజయవంతంగా జరిగిన ఎలక్షన్ల పట్ల అంతా సంతోషం వ్యక్తమవుతున్నా అంతర్గతంగా మారుతున్న వ్యవస్థ మరియు పరిస్థితులను అవలోకించిన చో ఆందోళనకరంగా వున్నట్లు తెలిపినారు.

వివరంగా వివరించమని కోరినప్పుడు శేషాద్రిగారు 'పోలీసు జిల్లాగా' పేరొందిన 'దొడా' కు వానికి ఆ ప్రత్యేకత తొలగింపువల్ల ఆప్రాంతం టెర్రరిస్టులకు నిలయప్రాంతం అవటం వల్ల చాలా మంది హిందువులు ఆప్రదేశం వదలి పారిపోవాల్సి వస్తున్నదని చెప్పినారు.

జమ్మూను మూడు ప్రాంతీయ కౌన్సిల్లుగా ఏర్పాటు, రెండు ప్రాంతాలు లడక్‌లో మరియు ప్రతేక అటానమి కాశ్మీరుకు అనే విషయాలు చాలా తీవ్రమైన విషయంగా పరిగణించవచ్చు. కాశ్మీరునుండి ఇతర రెండు ప్రాంతాలను ప్రత్యేకంగా విడదీయడమే, ఈవిధానమని స్థానికులు ఆందోళన చెందుతున్నారు. ఎందుచేతనంటే జమ్మూలోని మూడు విభాగాలలో రెండు భాగాలు మరియు లడక్‌లోని కార్గిల్ ప్రాంతం పూర్తిగా ముస్లింల ఆధిక్యతతో కొనసాగుతున్నాయి. అంతేకాక అవి కాశ్మీరు ప్రక్కగానే వున్నాయి. దేశ విభజనకు ముందు పాకిస్తాను వైపు మాత్రమే మొగ్గు చూపించిన ముస్లింల నుండి హిందువులకు సంకేతాలు అందుతూవున్నాయి. వారంతా ఈ ప్రాంతాలకు తిరిగి వచ్చి స్థిరపడి వీరి (హిందువుల) ఆస్తి పాస్తులు వారి స్వంత ఆస్తులగా తిరిగి లాక్కొన గలరని భీతి చెందుచున్నారు. ఈ సందర్భంలో డా.అబ్దుల్లా ఇచ్చిన వాగ్దానం 'కాశ్మీరునుండి తొలగిపోయిన హిందువుల పునరావాసం దాని ఏర్పాటు గురించి అడిగినప్పుడు, అప్పటి డిప్యూటి హోంశాఖమంత్రి గారు స్వయంగా కనీసం తను కూడ తిరిగి కాశ్మీరుకు వెళ్లగలిగే స్థితిలేదని అందువల్ల హిందువుల పునరావాస ప్రసక్తి లేనేలేదు అనిచెప్పినారు. అంతేకాక కాశ్మీరుకు ప్రత్యేక ప్రతిపత్తి గురించి ఆలోచిస్తున్న ప్రస్తుత పరిస్థితులలో సూక్ష్మసంఖ్యలో వున్న హిందువులు అక్కడ ఏ విధంగా గౌరవ వ్యవహారాలకు మనగల్గుతారు అన్నారు.

సైనికుల యొక్క మనస్థైర్యాలు ఏవిధంగా వున్నాయి అన్న ప్రశ్నకు శ్రీ శేషాద్రిగారు జవాబు చెప్తూ ' ఈమధ్య విడుదలచేసిన అనేక మంది మిలిటెంట్లు, దేశభక్తిని ప్రకటించే విధంగా టెర్రరిస్టులకు వ్యతిరేకంగా ప్రవర్తించిన వారి మీద కఠిన చర్యలు వగైరా మన సైనికుల మనోభావాల్ని తీవ్రంగా గాయపర్చేవిగా వున్నాయి అని పేర్కొన్నారు. మానవ వ్యతిరేక కార్యకలాపాలుగా చిత్రించగలవని భయంతో వున్న సైనికులు తమజాగ్రత్తలో తాము వుంటూవుడడం వల్ల టెర్రరిస్టులను అడ్డగించువారు లేక పోవటం, వారిని అరెస్టుచేయకపోవటం తగ్గిపోయింది అన్నారు.

అక్కడ నివసిస్తున్న హిందువులకు ఈ విషయాలు ఎంతవరకు తెల్సు అన్నప్రశ్నకు జవాబిస్తు శేషాద్రిగారు "డా. కరణ్‌సింగ్ మరియు ఆయన కుమారుడు, డా. ఫరూక్ కూటమిలో చేరినప్పటికి ఆయన హిందువులగురించి ఎప్పటికప్పుడు ఊరటగా ఉపన్యసిస్తు వున్నప్పటికి, ఎప్పుడో ఒకప్పుడు వారు

ప్రస్తుత వాస్తవాలను ఎదుర్కోవలసి వుంటుదన్నది మరవరాని నిజమని వారందరు ఎరుగుదురు అని అన్నారు.

ఆప్రాంత హిందువులను కాని, లేదా మొత్తం దేశానికి గాని పై పరిస్థుతుల ప్రభావం ఏమైనా వుంటుందా అన్న విషయానికి శ్రీ శేషాద్రిగారు జమ్మూకాశ్మీరు రాష్ట్రం 1952 కు పూర్వపు స్థితిని సమిపించుటకు సిద్ధమయివున్న పరిస్థితి అంటే ''మెడమీద వేలాడుతున్న కత్తి'' అన్నమాట. అది భారత నైసర్గిక స్వరూప స్వభావానికి కూడ సవాలువంటి పరిస్థితి అని చెప్పవచ్చు.''

వేద సందేశం

# విశ్వకల్యాణము

– వాఖ్యాత:పి. వి. రమణారెడ్డి

''స్వస్తి గోభ్యో జగతే పురుషేభ్య:''

మా గోవులకు (పశువులకు) ప్రపంచమునగల సమస్త మానవులకు శుభములు కలుగుగాక.

శం న: కరత్యర్వతే సుగం మేషాయ మేష్యే

గోభ్యో నారిభ్యో గవే ఋగ్వే 1 – 46 – 6

ఓ పరమేశ్వరా! మా అశ్వములకు, గొర్రెమందలకు, పురుషులకు, స్త్రీలకు, ఆవులకు, ఎద్దులకు సుఖము కల్గించి – శాంతిని ప్రసాదించుము.

సర్వేశ్వరుడేకాదు, మన స్త్రీ, పురుషులున్ను – పరప్రాణులకు కల్యాణము కలుగవలెనని ఆశించవలెను. ప్రపంచశుభమును కోరుమని మన స్త్రీలకు చక్కటి ఉపదేశము వేదములందు చెప్పబడినది.

శివా భవ పురుషేభ్యో గోభ్యో అశ్వేభ్య: శివా

శివాస్మైమ సర్వస్మై క్షేత్రాయ శివా న ఇహైధి అథర్వ – 3-28-3

గృహవ్యవస్థాపకురాలైన ఓ నారీమణీ నీవు పురుషులకు కల్యాణమును కాంక్షిముము – గోవులు, అశ్వములు మొ॥ పశువులకు శుభమును కోరుము. సమస్త పృథ్వీమండలమందున్న ప్రాణికోటికి శుభములను కాంక్షించుము. మాకు సుఖప్రదాయివిగా ఈ లోకమున విరాజిల్లుము.

అట్లే పురుషులును లోకకల్యాణమును కాంక్షించువారుగా నుండవలెను.

శివో భవ ప్రజాభ్యో మానుషీభ్య స్త్వమంగర:!

మా ద్యావాపృధివీ అభి శోచీర్మా న్తరిక్షం మా వనస్పతీన్॥ యజు. 11 – 45

ఓ సత్వ్రతకా! నీవు మానవులందఱకు శుభప్రదాతవుగా నుండుము. ఈ భూమండలమందున్నటువంటి, లేక ఆకాశమునందున్నటు వంటి ప్రాణులకన్నిటికి – ఏ విధమైన బాధను కలిగించవలదు. అంతరిక్షమందున్న జీవులకుగూడా కష్టము కలిగించవలదు. అంతేగాదు, వనస్పతులకుగూడ – అనగా చెట్లు, చేమ మొ॥ వాటిని గూడా అనవసరముగా నాశనము చేయవలదు.

అయితే పృధివియందున్న అకాశమందున్న ప్రాణులుగూడ మనకు కల్యాణమును కలిగించవలెనని వేదము చెప్పుచున్నది.

శివే మే ద్యావాపృధివీ అభూతామ్ అథర్వ 19-14-1

స్వస్తి నో అస్త్వభయం నో అస్తు అథర్వ 19-8-7

మనకు శుభము కలుగుగాక. సర్వత్ర మనకు భయములేకుండుగాక.

జీవితం

# యుక్త జీవనమే ముక్తి

– చౌడూరి గోపాలరావు

జీవుడు కోరేవి చతుర్విధ పురుషార్థాలు, వాటినే ధర్మ అర్థకామ మోక్షాలు అంటారు. మానవ జీవితం ధర్మమాధారంగా అర్థకామాలు ఆర్జించటం లేదు యుక్త జీవన మాధారంగా మోక్షాన్ని సాధించటం. దీన్నిబట్టి జీవుని యొక్క జీవిత లక్ష్యం మోక్షమని తెలుస్తుంది మోక్షమంటే ముక్తి. ముక్తి అంటే విడుదల. దేనినుండి మనిషి విడుదల కావాలి. తాపత్రయాల నుండి. దుఃఖము యొక్క అత్యంత భావమే మోక్షము. అదియే జీవన్ముక్తి. దానికై యుక్త జీవనంకావాలి. యుక్త జీవనమంటె గీతా చార్యుడు చక్కగా నిర్వచించాడు.

''యుక్తాహార, విహారస్య, యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావ బోధస్య, యోగో భవతి దుఃఖహా ॥

ఈ నాడు మన గమనం భౌతికమై పోతున్నది. మనస్సు అర్థకామాల వెంట అధర్మహితంగా పరుగెత్తుతున్నది. ''యావజ్జీవేత్ సుఖం జీవేత్, ఋణం కృత్వా ఘృతం పిబేత్, అన్న చార్వాకుని మాటలే ఆదర్శాలౌతున్నవి. వైద్య విశారదుడైన సుశ్రుతుడు రోగమెది? అని వాగ్భటుని ప్రశ్నించాడట. అతడు హితభుక్, మితభుక్, ఋతభుక్, మరిచినందువల్ల అన్నాడట. మానవ జన్మ తినుటకే కాదు Eat, drink, be merry. కికాదు. ప్రతివానికి తినే హక్కు ఉంది. కాని హద్దులు దాటి కాదు. కాబట్టి కృష్ణుడు యుక్తా హార అన్నాడు. దీన్ని బట్టి మన జీవితానికి ఒక దిన చర్య ఉండటం మంచిదనిపిస్తుంది. హితాహారం, మితాహారంగా తీసుకోవాలి. పదార్థం వెనక మనస్సు ఉంటుంది. భీష్ముడు కృష్ణునితో నేను కౌరవుల ఉప్పుతింటున్నాను. ధర్మం వైపు మాట్లాడలేను అన్నాడు. శరీరమాద్యంఖలు ధర్మసాధనం కదా. అందుకే జీవన్ భద్రాణి పశ్యతి అన్నారు. అన్నిధర్మములు ఆచరించుటకు, నిత్య జీవన వ్యవహారం సాగించుటకు శక్తి కావాలి. అందుకై మనిషికి ఆహారము అవసరం. హితమైన ఆహారాన్ని తీసుకోవటమే సాధన అదేయోగము.

శరీరం పనిచేస్తుంది అలసి పోతుంది. దానికి విశ్రాంతికావాలి. విశ్రాంతి విహారం వల్లవస్తుంది. లేదా నిద్రవల్లవస్తుంది. విహార మంటె తిరగటం లేదా వ్యవహరించటం. వ్యవహరించటంలో కూడా నేర్పుకావాలి. సాధనకావాలి. మనం నిర్ణయించుకొనే వన్నీ మన పరిణామం పై ఆధారపడి ఉంటాయి. విషయలోలతలో కూడిన విహారం నష్ట దాయక మనిగ్రహించాలి. పరణామం వ్యక్తి వ్యక్తికి భిన్నంగా ఉంటుంది. వైవిధ్యం చెడ్డదికాదు. అందంకూడా భిన్నతలోనే ఉంటుంది. కాని మనిషి తన వ్యవహారం ఇతరులకు హానికారకం కాకూడదు. ఒక్క ఎదుటివానికేకాదు అతని కుటుంబానికి, గ్రామానికి, జాతికి, దేశానికి కీడుచేసే వ్యవహారం కాకూడదు. అలా వ్యవహరించినప్పుడే వ్యవహర్తకు విశ్రాంతి. క్రాంతి, ప్రశాంతి లభిస్తుంది. లోకాపచార వ్యవహర్తలనే రాక్షసులన్నారు. జగదుపకార వ్యవహర్తలనే సాక్షరులన్నారు. దీని దృష్ట్యానే యుక్త విహారం కావాలని కృష్ణుడన్నాడు. నిద్ర మనిషికి అలసట తీర్చుకొనుటకు కావాలి. కాని అధిక నిద్ర అలసత్వాన్ని తెస్తుంది. సూర్యోదయాత్పూర్వం లేవనివారికి ఆయుస్సుక్షీణిస్తుందని ఆయుర్వేదం చెబుతుంది. పాశ్చాత్యులు కూడా. Cocks Crow in morn to tell ustorise, and he who lies a late will never be wise. అంటారు కాబట్టి సోమరికాకుండా కర్తవ్యయపరాయణుడు. కాగల సామర్థ్యాన్ని యుక్త నిద్రలో ఉందన్నాడు గీతాచార్యుడు. నిద్రపోతుల్లో లేదన్నాడు.

ఈ రీతిగా యుక్తమైన ఆహారము, యుక్తమైన విహారము. యుక్తమైన వ్యవహారము, యుక్తమైన నిద్ర ఇవియే సాధన మార్గాలు. తద్వారా శరీర మారోగ్యంగా ఉంటుంది. ఈ వ్యవహారంలో అన్నింటిని అతిగా చేస్తే ఆరోగ్యం దెబ్బతింటుంది. అలాంటి వాని ఆత్మ ఉద్ధరింపబడదు. వాడె హృదయ దౌర్బల్యుడౌతాడు. అట్టి వానినే కృష్ణుడు క్షుద్రుడన్నాడు. వీరికి న్యూనగండ ముంటుంది. ఆత్మ దర్శనం కాదు. నాయ మాత్మా బలహీనేన లభ్యః అన్నారు. అందుకే వివేకానందుడు బలముపాశ్య బలముపాశ్య అన్నారు. ఆత్మ శక్తియే ఆరోగ్యము. ఆరోగ్యము వలనే మనో విజయము. మనో విజయము కలదే శక్తి వంతమైన దేహము. ఈ మూడు. తాపత్రయ నివారణోపాయములు. త్రివిధ దుఃఖాలనుండి విడుదల పొందుటే బ్రహ్మానందము. ఆ బ్రహ్మానందమే మోక్షము. అదియే జీవన్ముక్తి.

అందుకే ఆర్ష సంస్కృతి అందలి ఆధ్యాత్మిక తత్వము మానవ జీవన వికాసము వైపునడిపినది. మనిషి బ్రతికుండగానే మోక్షసాధన చూపింది. మోక్షము హస్తగతం కావడానికి. మానవుడా యుక్త జీవనం గడపాలని గీతాచార్యుని ఉవాచ. అందుకు ప్రయత్నం చేద్దాం. బ్రహ్మానందాన్ని అనుభవిద్దాం.

(ఆకాశవాణి హైదరాబాదు సౌజన్యంతో)

---

**వార్త** : యువ ప్రేరణ–బి.జె.వై.యం–బహిరంగ సభ (4.12.96) భాగ్యనగరంలో జరుగగా "ఐదుగురు భర్తలతో ద్రౌపదిలా ప్రధాని దేవెగౌడ పదమూడు పార్టీల అధీనంలో కీలు బొమ్మ ప్రభుత్వం".

– ఉమాభారతి.

"కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు యువత సమస్యలను పరిష్కరించడంలో విఫలమయినాయి"

– కిషన్ రెడ్డి.

"ప్రభుత్వప్రోత్సాహంతో స్వదేశ సంస్కృతిపై దాడి జరుగుతున్నది"

– వెంకయ్యనాయుడు.

"ప్రాంతీయ పార్టీలు దేశాన్ని పాలించజాలవు–యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం ఏ నిమిషంలో కూలుతుందో తెలియదు–దేశ ఆర్థిక స్థితి తీవ్రంగా దిగజారి నిత్యావసర వస్తువుల ధరలు నింగికెగశాయి–ధనార్జనకు రాజకీయం వ్యాపారమైంది–యు. ఎఫ్ ప్రభుత్వం ఇప్పటికి ఒక్క సమస్యా పరిష్కరించలేదు. ఆంధ్రలో పెనుతుఫాను నష్టం అపారం అంటూనే పునరావాస చర్యలను రాజకీయం చేయడం ఉచితంకాదన్నారు".

– ఎ.బి. వాజ్‌పాయ్

(మా.వి.)

---

**ఆదర్శమానవ జీవనం...**

వ్యక్తి – కుటుంబం – సమాజం, దేశం. నేటి భారతదేశ స్థితిగతులు యెరుగని మానవులు అరుదు. సమాజ దివ్యజీవనానికై ప్రతి మానవుడు రోజులోని 24 గంటల్లో, 8 గంటలు – వ్యక్తి పరంగా, 8 గంటలు – కుటుంబ వ్యవహారాలకు, 8 గంటలు – సమాజ ఉన్నతి–దేశప్రగతికి సమయ మిచ్చి పనిచేయటయే ఆదర్శజీవనం.

– వైయ్యార్.

# ప్రాణిమిత్రుడవై, మూగ ప్రాణుల్ని రక్షించు

''రాక్షసులు మనుషుల్ని చంపి తినేవారు''
మరి మనమో! రాక్షసాధములమై
మరోమెట్టెక్కి
బ్రతికున్న మేకనూ, కోడినీ
చంపకుండానే రక్తాన్నిత్రాగి
వినోదించి పలావుల పేరుతో
కాల్చుకొని తింటూ ఆనందిస్తున్నాము!
మనం మానవులమా?
మానవాధములమా? కాదుకాదు!
రాక్షసులకంటే అధమాధములం!
జీవహింసలో మనమే ప్రథములం!
తోటిమనిషినికూడా ఉరి లేకుండా
చంపెయ్యగల నేర్పరులం! అందుకే
మనం మానవులమేనా? అంటున్నది
భూతదయ ఎవరిక్కావాలి?
''పాపభీతంటూ'' పాత చింతకాయ
కబుర్లెందుకు?
అంటావెందుకు?
ఈ లోకంలో కాకపోయినా
పైలోకాల్లో నయినా ఆత్మ
శాంతించాలంటే !
ఘోరాతి ఘోరాల్ చెయ్యొద్దు !
మనిషిలోని ''మనీషి''ని (రప్పించు) బైట పెట్టు
మమతలతో
మూగజీవుల్ని లాలించి
ప్రేమించు! దేవాలయాల్లో
మూగజీవుల వధలను నివారించు
నీవంతు సాయంగా
మూగజీవుల్ని రక్షించండంటూ
నినదించు !
భుజం భుజం కలిపి
''జీవబంధు''వై ఉద్యమించు!
(మూగ) ప్రాణిమిత్రుడవై మూగ ప్రాణుల్ని రక్షించు
ఇదే నా-పిలుపు.

– హెచ్ వి. రమణ,

# అంతర్జాతీయ హిందుత్వం.

(పురాతన కాలంలో యావత్ప్రపంచం ఒకే ఒక మతాన్ని, అదే హిందూ మతాన్ని పాటించారు. ఈ క్రింది అభిప్రాయాలు రచయితవే తప్ప వి.హెచ్.పి అంగీకారం తెలుపకపోవచ్చు. ఈ క్రింది వాటిని విశ్లేషించి అభిప్రాయాలు తెలుపగలరు.)

## హిందుత్వం అనగా ఏమిటి?

(రాజన్)

1. హిందుత్వం ఒక మతం కాదు. జీవన పద్ధతి.

2. హిందుత్వాన్ని ఇతర మతాల నుండి గుర్తించదలచితే దానిని మతాల కలయికతో ఏర్పడిన మహామత సాగరం.

3. హిందుత్వం ఒకరు ప్రారంభించింది కాదు. ఇతర మతాలకున్నట్లు ఒకే ప్రవక్త! ఒకే పవిత్ర గ్రంథం అనేవి లేవు.

4. హిందుత్వం అన్న పదానికి మూలం హిందూనుండి కాదు. భారత్‌లో పాటించే మతానికి పర్షియన్ పదం హిందు.

5. ప్రారంభంలో 'హిందు' అనగా హిందూ (ఇండియా) దేశంలో నివసించేవారని అనేవారు. అంటే హిందూ, ఇండియన్ పదాలను సమానార్థాలుగా వాడేవారు.

6. సనాతన ధర్మ అనిపిలిచే హిందుత్వం మానవుడి ఆవిర్భావం అంత పురాతనమైనది. సనాతన అనగా పుట్టుక, చావు లేనివని, అంటే నిత్యమైనదని అర్థము.

7. పుట్టిన ప్రతిదీ గతించడం ప్రకృతి ధర్మం. అలాగే ఒక ప్రారంభం అనేది వుంటే సమాప్తం అనేది ఉండితీరుతుంది.

8. మానవుడితో ఆవిర్భవించిన హిందుత్వం మానవజాతి అంతరించేవరకు ఉంటుంది.

9. హిందుత్వం మానవుడి పరిస్థితులకు అవసరాలకు అనుగుణంగా మలచుకోదగినది. నేటి హిందుత్వం పురాతన కాలంలో పాటించినదానికి భిన్నమైనది.

## జీవితసభ్యులు

675. **SWAMI SIVANANDA LIBRARY**

Thulja Bhavan

Kachi Guga

Hyderabad -27

## గ్రంథపరిచయం :

'అండమాన్లో ఆజన్మాంతం' - (వీరసావర్కార్ జైలుగాధ) ప్రతి భారతీయుడు అక్షరఅక్షరం చదివి తీరవలసిన 301 పుట గ్రంథం.

గ్రంథ కర్త: మరాఠమూలం: వీరసావర్కార్.

హిందీ అనువాదం: పండితల.దా.నవరే.

తెలుగుసేత: డా॥కసిరెడ్డి.

మూల్యం: రూ100/-లు. ప్రాప్తి స్థానం: కార్యదర్శి, వివేకానంద వైజయంతి.

4.5-212, విజయశ్రీ

కోఠి, హైద్రాబాద్ - 500 095.

---

1. శ్రీ గాయత్రీ - సుందరకాండ మహాగంధ్రం 160 పుటలుగలది.

గాయత్రీ మంత్రం ''తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య.....''లోని 12వ బీజాక్షరం 'స్య' - 'స'తో 'సుందరకాండ' ప్రారంభించబడింది. 'స' మంత్రమహిమగల్గిన బీజాక్షరము-దీనిపారాయణ వలన సర్వకార్యములు సిద్ధించును''.

ఆస్తిక బుద్ధి గల వారికి ఆరాధ్యమైనది అని గ్రంధకర్త శ్రీ కల్లూరి సూర్యనారాయణ, M.Sc (Dy. Director (Entomology) తన గ్రంథంలో విశదపరచారు - అందరూ పారాయణచేయ తగిన గ్రంథం.

మూల్యం: 54/-

**2. Gayatri Maha Mantra**-(in English)
The Epitome of Vedas
Series - 1. (Glory of Gayatri)
**- By Kalluri Suryanarayana.**

ప్రాప్తిస్థానం: సాంఖ్యాయన విద్యాపరిషత్
H.No.2-12-34, అన్న పూర్ణాకాలనీ,
ఉప్పల్, హైదరాబాద్ - 500 039.

3. **'ఆసుపత్రికి వెళ్ళకుండా ఆరోగ్యం కాపాడుకోండి'.**

కళాప్రపూర్ణ, డా. పోతుకూచి సాంబశివరావు గారు ఆరోగ్యమే మహాభాగ్యం వినండి అంటూ ప్రకృతి చికిత్స, ఆయుర్వేద వైద్యం అనుసరించండని అందరికి అందుబాటులో ఉండే అనేక చిట్కాలు 32 పుటల్లో యిమిడ్చి 3/-రూపాయలకే లభ్యపడేట్లు చేశారు.

ప్రాప్తి స్థానం:- 'విశ్వరచన' కార్యాలయం-6-3-195న్యూబోయిగూడ
సికింద్రాబాదు-3

4. **'వ్యాసకథలు'** - 44పుటలగ్రంథం - వెల 12/-
గ్రంథకర్త డా. పోతుకూచి సాంబశివరావు - ప్రాప్తిస్థానం! 'విశ్వరచన'
6-3-195-న్యూబోయిగూడ
సికింద్రాబాద్-3

## వార్తలు :

★కల్యకుర్తి: లో ప్రఖండ స్థాయి భజనపోటీలు నిర్వహించగా 10భజనమండలులు పాల్గొన్నవి. ప్రథమ బహుమతి పంజుగుల గ్రామంవారు దక్కించుకున్నారు. అని వి.హిం.ప. ప్రఖండ ప్రముఖ్ శ్రీ యన్. యాదగిరి తెలియజేశారు.

★విశాఖపట్నణం :- దాశరథి శతక పద్య పఠనపోటీలు జనవరి 1997లో నిర్వహించి సంక్రాంతి బహుమానాలు అందజేయబడునని శాంతిపీఠం ''శ్రీ రామరక్ష'' మహోద్యమం, రామనివాస్, 6-17-4, ఈస్ట్ పాయింట్ కాలనీ విశాఖపట్నణం, 530 023 వారు తెలియజేశారు. వివరాలు వారినుండి పొందవచ్చు.

★చీరాల:- 'జనసంక్షేమ సమితి' వారు కోనసీమ తుఫాను బాధితుల సహాయర్థం రూ12650-00లు సేకరించి డి.డి.ద్వారా విజయవాడ వి.హిం.ప.కార్యాలయానికి పంపినట్లు శ్రీ.వి.రామకృష్ణారావుగారు తెలియపర్చారు.

★ఖమ్మం :- జిల్లాలోని సత్యనారాయణపురం గ్రామంలో కార్తీక్ పూర్ణిమినాడు 3500 దీపాలలో దీపార్చన కార్యక్రమం జరిగింది. భద్రాచలంలో 108 దీపాలతో.దీపార్చన కార్యక్రమంజరిగింది. ముదిగొండలో 2.12.96న 37మంది దంపతులలో సత్యనారాయణ స్వామివ్రతం సామూహికంగా జరిగింది. అదేరోజు నెల్లిపాకలో 30మంది స్త్రీలు దీపారాధనకార్యక్రమం జరిపినట్లు శ్రీ విశ్వనాథశర్మ తెలిపారు.

---

★ 26.12.96నుండి6.1.97వరకు తుంగభద్ర పుష్కరాలు జరుగుచున్నవి. విశ్వహిందూ మహాసంఘం. ఆంధ్రప్రదేశ్‌శాఖ యాత్రికులకు ఆలంపురంలో అన్నదానం నిర్వర్తించుచున్నారని కార్యదర్శి వేంకటరావుగారు తెలియజేశారు.

★ ''ప్రపంచ వ్యాప్తంగా అవినీతిమయమై ప్రథమ స్థానంలో నిలిచిన దేశం పాకిస్తాన్''
-ప్రపంచవ్యాప్త అవినీతి నిరోధక సంస్థ-

పత్రిక-క్రూసేడర్

## మాస విశేషాలు :

(మార్గశిర-పుష్యం) జనవరి-97
1- ఆంగ్లవత్సరాది.
12-వివేకానంద జయన్తి
13-భోగి
14-మకరసంక్రాంతి
15-కనుమ
23-శ్రవణకార్తె
-బోస్ జయన్తి
26-రిపబ్లిక్‌డే
28-త్యాగరాజవర్ధంతి
30-గాంధీవర్ధంతి

ఫిబ్రవరి-97 (పుష్యం-మాఘం)
4-తానాజీబలిదాన్
5-గురుమౌఢ్య నివృత్తి
8-మాఘస్నానారంభం
14-రథసప్తమి, శివానంద జయన్తి
15-గురూజీ జయన్తి
17-భీష్మ ఏకాదశి
19-శ్రీ రామకృష్ణ పరమహంస జయంతి
20-శుక్రమౌఢ్య ప్రారంభం
27-చంద్రశేఖర్ అజాద్‌బలిదాన్



జనవరి 23, నేతాజీ శతజయంతి పూర్తి